# MOGALIREKU

BY

Vidwan Kaviraj & Pandit

Sree Penumetsa Satyanarayana Raju,

Senior Telugu Pandit,

BOARD HIGH SCHOOL, TANUKU.



PUBLISHERS:

ROWTHU BOOK DEPOT,

Educational Publishers,

RAJAHMUNDRY.

 1952 [Price Re. 1/-

# మొగలిరేకు

విద్వాన్ కవిరాజు పండిత
శ్రీ పెనుమెచ్చ సత్యనారాయణరాజు
జయపుర సంస్థాన గౌరవాస్థానకవి,
తణుకు బోర్డుహైస్కూలు సీనియర్ తెలుగుపండితులు.



పబ్లిషర్సు :
రౌతు బుక్కు డిపో.,
విద్యావిషయిక ప్రచారకులు
రాజమహేంద్రవరము.

1952

 [వెల రు. 1-0-0.

# మొగలిరేకు

## ౧

'తామరపాకునీరువలెఁ దల్లడ మందిరి కోట నందరున్'

అరుణోదయమును సూచించుచు నప్పుడే మొగలితుర్తి కోట దేవిడీ పై భాగమునఁ బ్రాభాత గీతికలు వందులు పాడ నారంభించిరి.

నాఁడు సూర్యోదయమై యించుమించుగా నొక జామైనను గోటలోపలఁగాని హజారములోఁగాని యంతగా నందడి కానవచ్చుటలేదు.

లోకబాంధవుని రాకకుఁ బూర్వమే వందిగీతికలచే మేలుకని దాస దాసీజనంబులు తమతమ పనులలో నిమగ్నులగుట యాచారము.

సేవకులు ఇటునటు తిరుగుచున్నారు. వారినడకలలోఁగాని, ముఖములలోఁగాని, చేతలలోఁగాని, యుత్సాహము చుఱుకుఁదనము నగబడుటలేదు. పైఁగా నొకరి నొకరు కను సైఁగలతోఁగాని పలుకరించుకొనుటలేదు. 'ప్రతివాఁడు' కాలి చప్పుడుకాకుండ నడచుచున్నాఁడేకాని ఠీవిగా టీకుగా నడచుటలేదు.

రాజదర్శనార్థమై వచ్చినవారెల్ల దేవిడీయొద్దనే యాఁవఁబడుచున్నారు. ఒక్కఁడును లోపలికిఁ బోవుటకు నాజ్ఞకాలేదు. ఎవ్వరికి నేమియుఁ గారణము తెలియుటలేదు.

దర్బారుమహాలైన సుధాకర మందిరము తలుపులైనను నింకను దెఱువఁబడలేదు. సింహాసనాదులపై ధూళి దుమారములు దులుపుటకై వచ్చిన సేవకులు చేతులు ముడుచుకొని యాప్రక్కను ఈప్రక్కను ఒదిఁగియున్నారు. 'ఏరా యింకను నిలువఁబడియున్నారు పని పాటు లేదా' యని యెవ్వరును హెచ్చరించుటలేదు. ఎవరికి వారే యేదో యొకమూలఁ జతి కలఁబడుచున్నారు. ఒకరిపై నొకరు అధికారము చలాయించుటయైనఁ గానవచ్చుటలేదు. ఏమిది యాశ్చర్యము! ఇంత స్తబ్ధత యెన్నఁడు నాకోటలో నగపడలేదు. ఇలువేల్పైన పట్టాభిరాముని యాలయప్రాంగణంబున బారులుతీరి పుణ్యాంగనలు నిలువఁబడియుండిరి. కొందఱి చేతులలోఁ బైఁడిపళ్ళెరములలో నానావిధ కుసుమమాలికలు విరాజిల్లుచున్నవి. కొందఱి హస్తములలోఁ బవిత్ర జలపూరితములగు కనకమణికలశములు భాసిల్లుచున్నవి. కొందఱి పాణితలంబుల శంఖములు మెఱయుచున్నవి. వారి వాలకంబులు గాంచఁ గాళ్ళులాగి చతికిలఁబడ నెంచుచున్నారా యనునట్లు లొయ్యారంబుగా నొకప్రక్కకు వంగివంగి తొంగితొంగి చూచుచున్నారు. కొంద ఱబలలు ముచ్చెమటలుపోసి యుసురను రవుచున్నారు. చేతులు మార్చి పళ్ళెములు త్రిప్పుకొనుచున్నారు. కాని యొక్కరును ఏవస్తువును గ్రిందఁబెట్టుటకు సాహసించుటలేదు. అర్చకుఁడు కూడ నట్లే నిలువఁబడియున్నాఁడు.

అప్పటి కప్పుడే జామున్నర పొద్దుకూడ నెక్కినది.

బ్రాహ్మీముహూర్తమునకుఁ బూర్వమే కాలకృత్యములు నిర్వర్తించు మహారాజు లేచినట్లుగాని, స్నానము చేసినట్లుగాని, సంధ్యవార్చినట్లుగాని కనుపించుటలేదు.

అంతఃపురములోని ముగ్ధాంగనలుగూడ ముద్దునకైన ముచ్చటలాడుకొనుటలేదు. ఎక్కడను చంటిబిడ్డల యేడ్పయిన విననచ్చుటలేదు. గుఱ్ఱాల సకిలింపులు ఏనుఁగుల ఘీంకారములుగూడ మాటువడెను.

ఎవరిదో యీయాజ్ఞ తెలియదు. ఎందులకో యీ నిశ్శబ్దత యెఱుఁగరాదు.

నలుసంత యీగడ తెలిసినఁజాలు ఊరు వాడ చెప్పుకొను నలవాటుగల రాజసేవకు లొక్కరును పెదవి కదుపుట లేదు. నోరెత్తుటలేదు. నిత్యోత్సవము పచ్చతోరణమునైన యీకోట యీతీరున నుండుట కిదే మొదటిసారియేమో!

సుధాకరమందిరమున కెదురుగానె, లక్ష్మీవిలాస మందిరము వెలయుచుండును. ఆ చంద్రశాలా సోపానములపైని ఆనియాని నడచుచు దిగివచ్చుచున్న పాదముల చప్పుడు సన్నసన్నముగా వినవచ్చుచున్నది. పాముచెవులుగల రాజభటులు కొందఱదివిని యప్రమత్తులై నిలిచి యాసౌధముక్రింది విశాల సుందరాంతర్భాగమునఁగల యాసనంబుల ప్రక్కకొదిఁగి మస్తక న్యస్తహస్తులై యడఁకువ దోఁప నమస్కరించుచు నుండిరి.

ఇంతలోఁ జక్కని దబ్బపండువంటి యొక శతవృద్ధు మందగమనంబున వచ్చి యొక వడక కుర్చీలోఁ గూర్చుండెను. వయస్సు

గమారమి మెనుబదియేండ్లుండియున్నను శరీరపాటవ మేమియుఁ దగ్గలేదు. తెప్పలు వ్రాలిపోయిననూ జూపులకుఁ జత్వారము రాలేదు. మేను ముడుతలు పడినను బటుత్వము తగ్గలేదు. విశాలమై మెత్తైన వక్షస్థలము, దీర్ఘ నాసిక, ఆకర్ణాంత విశాల నేత్రములు, ఎగుభుజములు, అజానుబాహువులు, వర్ణకిణ ములు వాని రాచఠీవినిఁ జెప్పక చెప్పుచున్నవి.

ఆతని గంభీర హృదయమున నేమి గాలిదుమారములు లేచుచున్నవో, యేసముద్రము ల్లకల్లోలము లగుచున్నవో యే యగ్నిపర్వతములు కలపిల యుడుకుచున్నవో! ఆ మహా మహుఁడు కూర్చుండియుఁ గూర్చుండకమునుపే

"రంగన్నృపాలు హేతి రణరంగమునన్ పరరాట్కులాగ్రణీ
రంగ దభంగ రింగణ తురంగ శతాంగ మతంగజంబు లా
రంగఁ జెడంగ వచ్చి యలరంగఁ గనుంగొని తత్కృతార ధా
రం గడు సన్నుతింతు రమరన్ గగనంబున ఖేచరోత్తముల్"

అని మాగధులు ఎలుఁగెత్తి ముక్తకంఠముతోఁ బాడిరి. ఆపాట వినుటతోడనే రాకాసిశాకరునిఁ బోలిన యాయన మోముపై ధూళియు దుమారంబును రేఁగి కెరటములై కొట్టు కొనుచు 'లావా' ద్రవమై కన్నులవెంటఁ బాఱఁజొచ్చెను. ఆయుర మోడ్పుఁ గన్నులలో నాఁగలేక పాఱు నాబాష్పములచే వానియంగరాఖయంతయుఁ దడిసి ముద్దయైపోయెను. ఎవ్వరును ధైర్యముచేసి యడిగి కారణము తెలిసికొన సాహసింపలేకపోవు చున్నారు.

అప్పుడొక ద్వారపాలకుడువచ్చి వంగి నమస్కరించి బెదరుచు 'మహాప్రభూ! ఆచార్యులవారు విజయంచేసినారు.

ఏమీ జవాబు రాలేదు. చూచినాఁడు చూచినాఁడు ద్వారికుఁడు మరల నమస్కరించి, 'మహాప్రభూ! ఆచార్యులవారు రామరాజుబాబుగారి విద్యాగురువులు దయచేసినారు.

మహారాజు:— సరే ప్రవేశపెట్టు.

వెంటనే పోయి తిరుమలాచార్యులతో నాతఁడు మహారాజుచెంత కరుదెంచెను.

అప్పటికప్పుడే మహారాజులేచి నాలుగడుగులు ముందుకువైచి, యెదురుగావచ్చి 'గురుదేవా! నమస్కారము దయచేయుఁడు. ఎక్కడనుండి రాక! ఇంటియొద్దనుండియేనా! అంతా క్షేమమేకదా? దయచేయుఁడు'

అని యిరువురు చెఱొక కుర్చీపైని నాసీనులైరి.

తిరుమలాచార్యులవారు కేవలము పండితుఁడుమాత్రమే కాక, విశేషించి యర్థశాస్త్రవేత్త, దూరదర్శి, కుశాగ్రబుద్ధి, పరేంగితజ్ఞుఁడు, మహారాజునకుఁ గులగురువు. కావుట మహారాజు ముఖవర్చస్సును జూచి చూచుటతోడనే యాతఁడు డోలాందోళిత మనస్కుఁడై యున్నట్లు గ్రహించి,

'మహాప్రభూ! ప్రభువు లేమిటి కిట్లున్నారు ? ఇంకను దాము స్నానముగూడఁ జేసినట్లు కానవచ్చుటలేదు. తమ మనస్సునకుఁ గలఁత దెచ్చినదేమి ? మనుమల నెత్తుదురన్న శుభవార్త కూడ మాకు వినవచ్చినదిగదా! ఈ శుభసమయ

ములో నీరీతిగానుండుటకుఁ గారణము తోఁచుటలేదు. రాజ్య భారము శ్రీరామరాజు భుజస్కంధముపైఁ బెట్టి వానిని యావ రాజ్య పట్టాభిషిక్తునిఁ జేసినారుగదా! ఇఁక మీకు విశ్రాంతి తప్ప ఇతరభారము ఏమీ లేదుగదా! నిరీహులరగు మీకింత వంత యేమిటికి ? నేను వినరానిది కాదుకదా !'

రం:— ఆచార్యులవారూ ! అంతా మీ రెఱింగినదే. చెప్పుట కేమున్నది. మీ శిష్యుఁడు ఆదినుండి శుద్ధ వేదాంతి. ఎంతసేపు ఉపనిషత్తులే ముందువేసికొని కూర్చుండును. రాజ కీయములన్నఁ జెడచెవినిఁ బెట్టును. కవిత్వపుఁ బిచ్చిలోఁగూడఁ బడినాఁడఁట. ఓరంత ప్రొద్దు ఏదో వ్రాయుచునే కూర్చుండును. ముచ్చటకైన నొక్కయేనుఁగు నెక్కఁడు సరికదా గుఱ్ఱమునైన నెక్కఁడు. పాదచారియై వాహ్యాళికిఁబోయి కోటగోడపైఁ దిరు గుచు బురుజులపైఁ గూర్చుండి యేకోయిల కూఁతనో వినుచు నేయింద్రధనుస్సునో కనుచు ఏలపాటల నాలించుచుండును. ఈ వయస్సులోఁగూడ నేనే యిదంతయు నీఁడుకొనివచ్చుట తప్ప లేదు. పోనీ యెప్పటికైన హాని కేతోఁచును త్రోందరయేమిటి. ఓపికయున్నన్నినాళ్ళు ఏదోమాదిరిగాఁ గాలము వెళ్ళఁబుత్తము అని యూరకొన్నాను. పట్టిన కత్తి, కట్టిన నడుము వీడకుండ నెంతరాజ్యమైనను సంపాదించినాను. రాబడి వృద్ధిచేసినాను. ఇదంతయు సరిగాఁ జూచుకొని సత్రములు కట్టించి సమారాధ నలు చేయరాదా ? గృహస్థుగానుండి సాధింపలేని మోక్షము తపస్సుచేసి సాధించునా ? క్షత్రియుఁడు కర్మయోగిగాని కర్మ

సన్యాసిగాఁడుగదా! భగవద్గీత త్రిమత భాష్యములతోడను
మీయొద్ద నేకదా చదివినాఁడు. ఇంతమాత్రము స్వారస్యము
గ్రహింపలేఁడయ్యెనా? రాచకూఁతురు బిడ్డల నెందులకుఁ
గనును. యుద్ధముచేయుటకు, రాజ్యము లేలుటకుఁగదా! దుష్ట
శిక్షణము చేయఁజాలని రాచఱిక మేటికి? నాయాశలన్నియు
నడియాసలు చేసినాఁడు. ఇంటిలోఁజూచినఁ గోడలికి నెల
మసలినది. నాయింటిలోఁజూచిన జవసత్త్వము లుడిగినవి.
కాటికిఁ గాళ్ళు చాచుకొనియున్న నాకు వానికన్న నెవ్వ
రున్నారు? పోనీ! నాన్నగారూ! తీర్థయాత్రలకు వెళ్ళివచ్చెద
ననినైనఁ జెప్పలేదు. కూడ నెవ్వరిని దీసికొనిపోలేదు. ఎన్ని
యేనుఁగులున్నవి? సాలలో; ఎన్ని గుఱ్ఱములున్నవి? పందడిలో;
కాలినడకతో నర్ధరాత్రివేళ లేచిపోవునా?

తి:— నేఁ డితఁడా! నాఁడు బుద్ధుఁడా- ఎంత త్యాగము!
ఎంత త్యాగము! అబ్బా! నేను పాఠములు చెప్పునాఁడు అను
మానించుచునే యుండెడివాఁడను. ఎప్పుడు యుద్ధములన్న
వైముఖ్యముచూపుట భగవద్గీతకు శంకరభాష్యమొక్కటే సరి
యైనదని వాదించుట వినినప్పుడెల్ల నాయనుమానము బలపడె
డిది. ఇంతకు బాబుఎచ్చటనున్నాఁడు! ఏమైన జాడ తెలిసినదా?

రం:—ఆచార్యులుగారూ! దివాంజీ వెంకయ్యగారు కొం
చెము జాడతీసినారు. పాపము ఆయన యీవార్త తెలియఁ
గానె నిలుచున్నవాఁడు నిలుచున్నట్లుగాఁ బైమీఁద బట్టవైచి
కొని పరుగెత్తినాఁడు. చిట్టడవులు, కాఱడవులు, పాపికొండలు

మొదలైన వన్నియుఁ దిరిగినను ఎక్కడ జాడ తెలియలేదు. నెలనాళ్ళుతిరిగి విసివి వేసారి తోఁటపల్లికొండలు చేరుకొన్నాఁడు. ఆకొండలలో ఏ లోయలోనో, యే గుహాలోనో యాతఁడొక తూరి యెవరికో యగపడినట్లును, ఇంకను జాడతీయుచున్నానని మాత్రము వ్రాసినాఁడు. ఇంతవఱకు మావానిని జూడలేదు. పాపము ఆతఁడుకూడ నావలెనే యీపెద్దవయస్సులో విశ్రాంతి తీసికొనుటకు బదులుగా అశాంతదీక్షతో నరణ్యాలవెంటఁ దిరుగుచున్నాఁడు. మావాఁడెన్నాళ్ళకు నగపడునో! ఆతఁ డెన్నాళ్ళకు వచ్చునో! ఏమీ తోఁచుటలేదు.

తి:— సరే యిపుడు మించినదేమియులేదు. జాడ తెలిసి నదికదా! మనమిరువురము పోయి యాతని మనస్సు మరలించి యింటికిఁ దీసికొనివత్తము, రేవు ఉషఃకాలములోఁ బ్రయాణ మునకుఁ జాల ననుకూలముగానున్నది. కాని మీరు కోటలో లేనప్పుడు రాజ్యచక్ర మెట్లునడచును?

రం:— ఆచార్యులవారూ! ఉన్నాఁడుగా మన స్నేహి తుఁడు రుస్తుంఖాన్ సాహెబ్.

తి:— రుస్తుంఖానా! ప్రభూ!

రం:— ఏమీ రుస్తుంఖానే?

తి:—ఏమీలేదుప్రభూ! ప్రభువులకుఁ దెలియనిదేమున్నది? అతఁడు గోలకొండనవాబులచేఁ బంపఁబడినఅమీన్ గదాయని.

ర:—ఔను. అయినను ఫరవాలేదు ఆచార్యులవారూ! అతఁడు మన శ్రేయస్సును కోరినవాఁడు. నిజాయితీకలవాఁడు.

నమ్మినవారినిఁ జెలుపఁడు. రాజ్యాంగతంత్రము బాగుగా నెఱిఁగినవాఁడు. కావున దుర్గరక్షణభారము వానిపైఁ బెట్టి వెళ్ళి వత్తము. ఇంతకు నిది తాత్కాలికము గదా!

తి:—మీచిత్తము. అట్లయిన అమ్మాజీయును కోడలు గోటలోనుందురా?

ర:—వారలు కోటలోనే యుందురు. అల్లుఁడుగారినిఁ గూడ రాఁ జేతును.

తి:—చిత్తము. ప్రభువులయిష్టము. ఏమో! నాకు మనస్కరించుటలేదు.

రం:—ఆచార్యులవారూ! శంకింపకుఁడు. పెందు ప్రొద్దు పోయినది. సాపాటుకు దయచేయుఁడు. ఎవరురా? అక్కడ?

భటుఁడొకఁడువచ్చి యాచార్యులవారిని దోకొనివెడలి చనెను.

---

## ౨

“ఓడలమీఁద ఏనుగుల నుజ్జ్వల తేజముతోడఁదెచ్చె................
రంగధరణీశ్వర మౌళి”

కలిదిండివారు సూర్యవంశపు క్షత్రియులు. మూలపురుషుఁడగు భల్లాణమహారాజు కాలమునుండికూడ వీరు వివిధ రాజ్యముల నేలుచుండిరి. కృష్ణామండలములోని కలిదిండిలో నొకకోటగట్టి వారిలో గంగరాజను నాతఁడు రాజ్యాధిపత్యము

వహించెను. తొలుతఁ గలిదిండికోటలోనుండి ధరాపాలనము సాగించుటచే వారియింటిపేరు 'కలిదిండి'యని ప్రఖ్యాతికెక్కెను.

క్రీస్తుశకము పదునైదువందల యెనుబదియైదవ సంవత్సరమునాఁటికి గంగరాజు పేరుప్రఖ్యాతులుగాంచి ప్రభుత్వాధికారము వహించెను. అతఁడె రాజ్యస్థాపకుఁడుకావుటచే మేనెల్ల జల్లెడతూఁటులవలెఁ దూఁట్లుపడునట్లు రేయింబవళ్ళు యుద్ధములుచేసిచేసి మహావీరుఁడై 'జల్లెగడల' గంగరాజు అని కీర్తిగాంచెను.

గంగరాజుయొక్క వీరతా శూరతా ధీరతలువిని గోలకొండపాదుషా మల్కిభరామ్ సంతసించి స్వయముగాఁ దన యున్న తావునకు ఆయనను రావించి యర్ధాసనమిచ్చి గౌరవించెను.

అప్పటికి మల్కిభరామ్ పాదుషా యేలుబడిలోనున్న ఏలూరు, అత్తిలి, ఆచంట, రాజమహేంద్రవరము, పేరూరు, మచిలీపట్టణము, తొందుర్రు, బొండాడ పరగణాలలోఁ దఱచు పితూరీలు రేఁగి యరాజకస్థితి యేర్పడెను. అది యణంచుట కతఁడశక్తుఁడయ్యెను. గంగరాజును "జల్లెగడల" బిరుదునన్నదులతో సమ్మానించి యాపరగణాలెల్ల నేలుకొనుమని 'ఫర్మానా' యొసఁగెను.

తన పాదుషాతనమును పేరునకుమాత్ర మంగీకరించుచు ఇష్టానుసారముఁగ నీ భూభాగమంతయు వంశ పారంపర్యముగా నేలుకొనుమని కత్తిపట్టి కరాఱుచేసెను.

అది మొదలుకొని మన రంగరాజు తరముదాఁక గంగ రాజు వంశస్థులు కలిదిండికోటలో నుండియె యీ భూభాగము నంతయు నేలంజూచిరి. కాని యేమిలాభము?

ఏదోయొకమూల నెప్పుడు పితూరీయె. సంఘములో స్నైమిత్యము లేదు. ప్రజలలో శాంతిలేదు. చెఱువులలో నీళ్ళు లేవు. పొలములలోఁ బంటలులేవు. తినఁదిండి, కట్టగుడ్డలేక జన సామాన్యము మలమల మాఁడిపోవుచుండెను. నిరంతరము యుద్ధములె.

క్రీస్తుశకము పదునాఱువందల యెనుబదియవ సంవత్స రమునాఁటికి ఆపితూరీలు చెలరేఁగి ఝుంఝూమారుతమువలె వీవసాగెను.

మహారాజు గంగరాజు ఆ యరాజకస్థితిచూచి సహింప లేకపోయెను. అపార సేనాసమేతుఁడై బయలుదేఱి యగపడిన శత్రువునెల్లఁ గండతుండెములు చేసెను.

"ప్రథన జయశాలియగు నతఁడు తనజైత్రయాత్రలోఁ దోలుదోల్త మిజ్జగమ్ములు నిండ మొఱయు ఫిరంగుల కదరు గుండియ పిక్కటెదరులేక బహువిధంబుల వచ్చు వలు తుపాకీ గుండ్ల కావంతయైన భయంబులేక సింగిణీ విండ్లచేఁ జిమ్మెడు క్రొవ్వాఁడి ములుకులకును వెన్కముందుగాక యార్చి కెవ్వన గోడ హత్తినప్పుడువచ్చు లగ్గదింపులకు బెగ్గడిలక బెట్టిదమ్ముగ భటులతోఁ జుట్టుముట్టి పటు విజయధాటిని 'ఏలూరుపాటి' కోటను లగ్గలకునెక్కి సాధించెను."

ఆ మహాయుద్ధములో మదగజములు తమ దంతప్రహార ములచే శత్రురాజుల బొమ్మలఁ జిమ్మి మాంసపంకములోఁ బడి పొరలెను. తురగములు తమ వాఁడిఖురపుటమ్ముల నరి వీరుల తలల నదిమిత్రొక్కి తుక్కుతుక్కు చేసి యెక్కుమ్మడి జయహేషలు గావించెను. వీరభటులు తమ నిశితకరవాలము లచే బొమ్మిచ్చి పోరిపోరి పోటరి మానిసుల నెల్లఁ జించి చెండాడిరి.

రంగరాజు శత్రుభయంకరుఁడై యాశ్రీతిగా వీరవిహా రంబు చేయుచు 'నేను' అని తలయెత్తిన వానినెల్లఁ దునిమి తూటాడి శత్రుశేషము లేకుండఁజేసి 'మొగలితుఱ్ఱు' అను పురమునఁ గోటకట్టి తన రాజధానిని గలిదిండికోటనుండి యచ్చటికి మార్చివైచెను.

మొగలితుఱ్ఱు పశ్చిమగోదావరిమండలమునఁగల నరసా పురమునకు రెండున్నర క్రోసుల దూరమునఁ గలదు. అది యంతయు నిసుకనేల. ఊరునకుఁ గూఁతవ్రేటుదూరమున నుప్పు టేఱు గలదు. ఆయేటినానిచియే కోట కట్టఁబడెను. ఆయేటి నీరే కందకమునఁ బాఱుచుండును. కోటకుఁగావలసిన పాటి మట్టియంతయు నక్కడికి నైదాఱు గవ్యూతుల దూరమునం గల 'లంకలకోడేఱు'ను గ్రామమునుండి తేఁబడెను. కోడేఱు నుండి మొగలితుర్తివఱకు మనుజులు నిలువఁబడి యొకరిచేతిలో నుండి యొక్కరు మట్టిముద్దలందుకొనుచు నీకోటఁ గట్టిరఁట. కోట తయారగునప్పటికిఁ గోడేఱులో నొక బ్రహ్మాండమైన

చెఱువు సిద్ధమయ్యెను. ఆ చెఱువునీటిచే వేలాది యెకరముల భూమి సాగులోనికివచ్చి పచ్చని పైరులచేఁ గనులపండువు చేయుచుండెను. ఆకారణమున సచ్చటి ప్రజలకుఁ గూడుగుడ్డలు పూర్తిగా లభించెను.

కోటగోడ సువిశాలమైయుండెను. దాని పైభాగమున రెండుబండ్లు అనాయాసముగాఁ దప్పుకొనవచ్చును. చుట్టు పదునెనిమిది బురుజు లమర్పఁబడెను. బురుజు బురుజునకు ఫిరంగులమర్పఁబడెను. క్రిందినుండి పైకెగఁ బ్రాఁకు శత్రువీరులఁ దునుమాడ ననువగునట్లు పెక్కు తుపాకి లాబురుజులకును, బురుజు బురుజు మధ్యగల గోడలకును, అధోముఖంబుగను, ఊర్ధ్వముఖంబుగను పార్శ్వముఖంబుగనుఅమర్పఁబడియుండెను.

దేవిడీయొద్దకుఁ బోవలెనన్నను కోటలోఁ బ్రవేశింప వలెనన్నను బరులకు శక్యముగాకుండఁ బ్రవేశమార్గము మలఁకలు మలఁకలుగా నమర్పఁబడెను. రాచనగరున కిరుప్రక్కలను రెండు ఫిరంగులమర్పఁబడెను. అహోరాత్రము లచ్చట విచ్చు కత్తులతో వీరభటులు నిర్నిద్ర జాగరూకులై కాపలా కాయుచుందురు. దేవిడీ పైభాగముననుండియే కాలగతిని దెలుపు వివిధ తూర్యారావములు గావింపఁబడుచుండును.

మొగలితుర్తిలోఁ బ్రవేశించినదాది రంగరాజు దేశ పరిపాలనమునందప్రమత్తుఁడై యుండుటయేకాక దేశదారిద్ర్యమును బోఁగొట్టుట కెన్నెన్నియో నూతన ప్రణాళికల నూహించెను. తన యేలుబడిలోఁగల యశేష భూభాగంబు

నను గాలువలు త్రవ్వించియుఁ జెఱువులు గొ్రప్పించియు నెల్ల వేళలఁ బండునట్లు కట్టడచేసి తత్కార్య నిర్వహణ భార మంతయుఁ దన దివానైన వెంకయ్యమీఁదఁ బెట్టెను. అది సుగ్రీవాజ్ఞ కావుటచే వెంకయ్య వెంటనే వసిష్ఠగోదావరీనదిలో నుండి కాఁకరపఱ్ఱు, తీపఱ్ఱులను గ్రామములనడుమ నొక పెటి కాలువను ద్రవ్వించి యందొకశాఖను పెరవలి కోడేఱులఁజుట్టి తణుకు వేల్పూరుల నెంబడివచ్చి గోస్తని కాలువతోఁగలిపి భీమవరము మీఁదుగా దక్షిణసముద్రమునఁ గలియునట్లు చేసెను. మఱొక్క శాఖను కాఁకరపఱ్ఱు, ఖండవిల్లి, పెనుగొండ లమీఁదుగా నరసాపురమునొద్ద గోదావరిలోఁ గలియునట్లు చేసెను. అదిగాక నడుపల్లికోటదగ్గఱ మఱొక్క కాలువ త్రివ్వించి కానూరు, సెట్టిపేట, చిలుకపాడు, తేతలి, పైడిపఱ్ఱు, అత్తిలిమీఁదుగా ఎనమదుఱ్ఱునొద్ద సముద్రమునఁ గలియునట్లు చేసెను. ఈకాలువలన్నియు, గోదావరీ జలపూరితంబులై యఖండ భూఖండంబు నెల్ల ముక్కారును బండునట్లు చేసెను. దేశమంతయు జలకావ్థత్వణ సమృద్ధమై పాఁడిపంటలచేఁ దుల దూఁగిపోవుచుండెను.

అదిగాంచి రంగరాజు సంతసించి ఆకాలువలలో నొక దానికిఁ దన దివానగు వెంకయ్యపేరును, మఱొకదానికి సహా యమంత్రియగు భూపయ్యపేరును బెట్టి వెంకయ్యకాలువ, భూపయ్యకాలువ యని లెక్కలలో సమోజుచేయించెను. మూఁడవకాలువకు దన సేనానాయకుఁడగు అర్కరాజు పేరు పెట్టెను. అదే కాలక్రమమున "నక్కలకాలువ"గా మాఱెను.

అంతేగాక ఖండవిల్లి మున్నగు పెక్కు స్థలములఁ బెద్ద పెద్ద చెఱువులు త్రవ్వించెను. ఏటికాలువ యొడ్డునఁగల యీ ఖండవిల్లి మున్నగుచోట్ల అరఁటి, పనసతోఁటలను బెంచునట్లు రైతులను బ్రోత్సహించెను. దొడ్డిపట్ల మున్నగుచోట్ల దమల పాకులతోఁట్లను, చెఱకుఁదోఁటలను బెంపొందింపఁజేసెను. కోన సీమయంతయుఁ గొబ్బరి, పోఁక, మామిడి, జీడిమామిడితోఁట లను నాటింపఁజేసెను. పసికిమాలిన చవుటిపఱ్ఱలనెల్ల నముద్ర జలంబులచేఁ దడిపించి యుప్పు పండింపఁజేసెను. రెడ్డిపోలవరము మున్నగుప్రదేశంబులఁ బత్తి వేయించి ఇంటింట రాటనములు త్రిప్పఁజేసెను. సేద్యమునకు వలనుపడని ప్రదేశములనెల్ల నడవుల నభివృద్ధి చేయించెను.

కూటికి గుడ్డకు కఱవులేకున్న జనముసు గనకవర్షము కురిసి కుబేరులను జేయనెంచెను.

వెంటనే యుప్పుటేఱులన్నియు వెడల్పుగను, లోఁతు గను ద్రవ్వించి పంటకాల్వలనుండి యుప్పుటేఱులకును, ఉప్పు టేఱులనుండి సముద్రములకును బడవలు నడచునట్లుచేసి వాణి జ్యము వృద్ధిచేసెను. ఎంతసేపు తనరాజ్యములోని సరకులు తనరాజ్యములోనే యున్నచో దానను కొన్నట్లుగా అర్థికాభి వృద్ధి కాదనితలంచి యీవఱకే తనయనుమతిపై నర్సాపురము లోని మాధవాయపాలెము నాశ్రయముగాఁజేసికొని వర్త కముఁజేయుచున్న ఒలందులకు (డచ్చివారికి) నచ్చట నొకరేవు స్థలమునిచ్చి వారిసాయమున ఓడల నిర్మింపఁజేసెను. తన

సామ్రాజ్యమునఁ బండు ధాన్యాదులను ముడిపదార్థములను ఆయోడలమీఁద చైనా, జావా, బోర్నియో, మలయా, బటేవియా, సుమిత్రాది దేశంబులకంపి యచ్చటినుండి నానావిధ ఫలజాతులను యంత్రపరికరంబులను ఇచ్చటకు రావించి వర్తక మభివృద్ధిచేయించెను. ఓడల రాకపోకలను గుర్తించుటకై తాను ప్రతిష్ఠించిన రామేశ్వర, లక్ష్మణేశ్వర దేవాలయములయొద్దను, అంతర్వేదిలో నృసింహస్వామివారి దేవళంబునొద్దను పెద్దపెద్ద గోపురంబులు కట్టించెను. ఆగోపురోపరిభాగంబులనుండి తిలకించినఁజాలు దక్షిణసముద్రమునుండి వచ్చు నోడలన్నియుఁ గనులముందు సాక్షాత్కారముఁ జేయుచుండును. తనవిశ్రాంతి కొఱకును రాజ్యాంగతంత్రమును నెఱపుకొనుటకును మాత్రమే కోటను మొగలుతుర్తిలోఁ గట్టెను. గాని యాధీరాగ్రేసరుని దృష్టియంతయు నరసాపురము మీఁదనే. ప్రాతస్సాయముల యందాతఁడు ప్రతిదినంబును మాధవాయపాలెము ఓలంద రేవులకు అశ్వారూఢుఁడై వచ్చి యచ్చటి యోడల జాడల నారయుచుండును. వర్తకాభివృద్ధియే దేశాభివృద్ధియని యా రాజపుంగవుని దృఢవిశ్వాసము. తనదేశపు శిల్పులను నేతగాండ్రను ఇతరదేశములకుఁ బంపుటయేగాక యచటి శిల్పులను నేతగాండ్రను ఇచ్చటకు రావించి యిచ్చటి శిల్పులకు సాలీలకు ఆయాకళల నేర్పించెను. చైనావారిచే చీని చీనాంబరములు నేయుట మనసాలీలు నేర్చుకొనిరి. ఆవస్త్రములే మహారాజు నిరంతరము ధరించుచుండెడివాఁడు. అంతతోఁ

దృష్టిచెందక యీయుదారమూర్తి మంచి శిల్పులకుఁ బాలగచ్చు
తో సౌధములుగట్టు నేర్పుఁబడఁజేయుటకై 'సుధాకరవిలాస
మను' నొకదర్బారు సౌధమును దసకోటలో చైనాశిల్పులచే
నిర్మింపఁజేసెను. దానినే జనసామాన్యము 'లక్కమేడ' యని
పిలుతురు. ఈ లక్కమేడలోని శిల్పకార చిత్ర నైపు
ణ్యమును వర్ణింప నేరము. చంద్రశాల (అంతస్తు) యంతయు
నాజూకైన టేకుచెక్కలచేఁ గూర్పఁబడినది. ఆ చెక్కపైని
చేయివైచిన జఱ్ఱున జాఱిపోవునట్టియు, జివ్వున లాగిపోవు
నట్టియుఁ దెల్లని పాలగచ్చు సేయఁబడెను. అది చంద్రకాంత
శిలామయమనియే చూపఱు తలంతురు. దాని పైభాగమం
తయుఁ జిత్రవర్ణసంశోభిత దారుమయ వికసిత వారిజాత వారం
బుచేఁ గనులపండువు చేయుచుండును. అందే మహారాజు పేరో
లగంబుండును. అందే రాజకీయములు చర్చింపఁబడుచుండును.
అందే కావ్యగోష్ఠులు నెఱపఁబడుచుండును. దాని కెదురుగనే
లక్ష్మీవిలాససౌధము నిర్మింపఁబడెను. అందు మహారాజును
మహారాజ్ఞియు నివసించుచుందురు. దాని వెనుకప్రక్కనే యిల
వేల్పైన పట్టాభిరాముని యాలయము, దాని నానుకొనియె
రాధాకృష్ణ విలాస మను భువనేశ్వరము (నాలుగిండ్ల బవంతి)
దాని మధ్యనే కళ్యాణమండపము దాని చెంతనే కేళాకూళి,
దాని వెంబడినే యించుకదూరమున వంటసాల, దాని వెనుకనే
నీటికుండు (Water Tank) ఆకుండునుండియే సుధాకర
మహలునకు ముందునున్న అవుతుఖానాలోని చిమ్మనగ్రోవుల

లోనికి జలనాళిక లమర్పఁబడెను. ఔతుఖానా కవ్వలిగోడను చేరియే దివాన్ ఖానా. ఆదివాన్ ఖానా కెదురుగా మంత్రివహాళి పర్యవేక్షణలో నుండునట్లుగా నొక మందుకొట్టును, ఒక యాయుధశాలయు, ఒక టంకసాలయు నెలకొనియుండెను. టంకసాలలో అహోరాత్రములు ధనలక్ష్మి గలగలలాడుచునేయుండును. ఆ లక్ష్మీ నిలాస్యము ఒరుల కంటఁ బడకుండుటకై యశ్వగజశాల లాచుట్టును గట్టఁబడియున్నవి.

అర్థశాస్త్రమున సందెవేసిన చేయియగుటచే నామహారాజపుంగవుఁడు ఎన్నఁడు కోట యేమఱక పాటించి, గడ్డియు, ధాణంబును, గొల్పును, గట్టెలును, నేయియు, నూనెయు, నానావిధ నవీనాయుధములును, ఔషధంబులును, అఖిలయంత్రములును, వాపీకూపంబులును మున్నగాఁగలవి యెల్లవియు సమగ్రములుగ సంపాదించి, కోటలో మూలుగఁజేసి రాజనీతి చతురుఁడై రాజ్యమేలుచుండెను.

ఆతని రాజ్యలక్ష్మి మచిలీపట్టణమున ఆడుకొని, యేలూరులోఁ బాడుకొని, నూజివీటిలో నించుక నేపాఁగి రెడ్డి పోలవరమున వ్రేళ్లు మోఁపి, పట్టిస శ్రీ వీరభద్రేశుని భక్తితో మొక్కి యఖండగౌతమి నవగాహించి, రాజమహేంద్రపురవర మార్కండేయస్వామికి నంజలించి, సప్తగోదావరమున నాచమించి, దక్షారామ భీమేశ్వరున కభిషేకించి, కోటిపల్లి తీర్థకుండలాముఖమున నర్ధేందుశేఖరుఁడైన సోమేశ్వరుని అర్చించి, గోదావరిని దాఁటి కాశ్మీర దేశంబును దోఁసి రాజను కోనసీమను

సందర్శించి యందలి కాసికా వైనతేయంబుల మున్కలిడి సేద దేఱి అంతర్వేది నృసింహస్వామికి సాష్టాంగంబులు కావించి, దక్షిణసముద్రతీరంబుననుండి తొంటి మచిలీపట్టణమువఱకు వాహ్యాళి సలుపుచుండును. అంతేకాక యాతల్లి తన మేలిక యగు రంగరాజు భుజాస్కంధమెక్కి యచంచలమైన కంజ కాల్వ (మొగలితుఱ్ఱు) కోటనుండి బయలుదేఱి యత్తిలి, ఆచంట, దొడ్డిపట్ల, పేరూరు, కొవ్వూరు, కొండపల్లి, ఉండి కోటలలో నెడ నెడ విహరించుచుండును.

ఏఁటేఁట దసరాదర్బారునాఁడు తన చరణసన్నిధిని, నూజివీటి అప్పారావులు, చింతలపూఁడి జూపల్లివారు, జమ్ములవాయి వెల్లంకివారు, విన్నకోట, గుడివాడ కమదనవారు, రెడ్డిపోలవరపు పాలెగాండ్ర దొరలు, సమర్పించు పాదభేటులుగాక రెండులక్షల ముప్పదినాల్గువేల కఱకు వరహాల (819000 రూపాయలు)తో నీరాజనములందుచుండును.

ఇట్టి యనంత రాజ్యలక్ష్మీవిలసితంబగు మొగలితుర్రి రాజ్యంబునఁ దన నామమాత్రపు అధికారమును స్థిరపఱచుకొనుటకై గోల్కొండనవాబుచేఁ బంపఁబడినవారే రుస్తుంఖానును, అతని కుమారుఁడగు హసన్‌ఖానును. తండ్రి కొడుకులిరువురును రంగరాజు మహారాజు నాదరమునకుఁ బాత్రులైరి.

రుస్తుంఖాన్ లోఁతుగుండెవాఁడు. అతని సరళహృదయములో మలినాంకములు లేకపోలేదు. అతని చూపులలో నోపరానితనము సూక్ష్మదృష్టికిఁ గానరాకపోలేదు. అతఁడు

స్వామిద్రోహి కాఁడు గాని యట్టియవకాశమబ్బిన జాఱవిఁడు వాఁడుకాఁడు.

హసన్‌ఖాన్ కేవలము అమృతహృదయుఁడు. వానిది నవనీతహృదయము. తఱచు ఆపన్నజనరక్షణముకై తపించుచుండును. నాలుకఁగోసిన నబద్ధమాడఁడు. కత్తిమీఁద నొఱఁగు ససహాయశూరుఁడు. శరణన్న వారినిఁ జేపట్టి రక్షించుటయే వాని వ్రతము, దీక్ష.

గోలకొండనువీడి మొగలితుర్తినిఁ జేరినదాది వారిరువు రకు సస్యశ్యామలంబును, ధనకనక వస్తువాహన సమృద్ధిదీపితంబును నగు నీరాజ్యమును వీడి వెడల మనసు పుట్టలేదు. రంగ రాజు మహారాజులుంగారి కరుణాకటాక్షమునకుఁ బాత్రులైన వారిరువురు ఈ రాజ్యమున దక్షిణమున నొక్కరుఁడును, ఉత్తరమున నొక్కఁడును సుస్థిరులై యుండ నిశ్చయించుకొనిరి. రాజానుమతిని బొంది రుస్తుంఖాన్ నరసాపురము పొలిమేర నంటియున్నచోటఁ దనపేరన 'రుస్తుంబాదా' యను గ్రామంబును, హసన్‌ఖాన్ దక్షారామమున కనతిదూరమునఁ దనపేర 'హసన్‌బాదా' యను గ్రామంబును నిర్మించుకొని ప్రభుభక్తి పరాయణులై యాయాగ్రామంబుల నివసించుచు మహారాజున కంగరక్షకులై విశ్వాసపాత్రులై మెలఁగుచుండిరి.

హసన్‌ఖాన్ స్వస్థాన వేషభాషాభిమతంబుల రతుండు గాక హిందూమతాభిమానియై హిందువులకుఁ దలలోని నాలుకయై చరించుచుండును.

రుస్తుంఖాన్ హిందూమతమును దూషింపఁడు గాని భూషింపఁడు. అప్పుడప్పుడు తన గోలకొండనవాబుల యందఁ జూచుకొని లోలోన మురిసి యుప్పుతో ముప్పందుము గ్రింగఁ జూచుచుండును. కాని వెంటనే తన యశక్తతను చాటించి, కీ లెఱింగి వాఁతపెట్టు మహారాజు ధాటిని దలంచి కలంగి తలంగి చనుచుండును.

---

## 3

'కొండల వాఁగులందిరిగి కూర్పఁదొడంగె నవీనకావ్యముల్'

విసర్గరమణీయములై నశిఖరములచేఁ దోఁటుపల్లికొండలు పాంథులను దమయంకమునకు నిరంతరము నాకర్షించుచునే యుండును. ఆకొండయంతటను గాఁడవులె. ఆ యరణ్యానిలో వెలుతురుసోఁకని భూములెన్నో యున్నవి. ప్రతిభూమిని మిట్టు, పల్లము, ఎఱుపు, నలుపు, తెలుపు, రాయి, రప్ప, తెలియకుండఁ బలుజాతుల పచ్చికలు మొలిచియున్నవి. నానావిధ లతాని కుంజములు, నానావిధ వృక్షజాతులు, పల్లవితంబులు, కుసుమితంబులు, ఫలితంబులునై విలసిల్లుచున్నవి. ఎడనెడ నొక్కొక్క-చోటఁ బండి కైవాలిన వరిమడులును, ఆరంబూచిన యొలిసె చేలును, జొఱకుఁదోఁటలును, చోడి చామచేలును ఆటవిక సంపద కానవాలుగా నున్నవి.

ఆకొండ కొనలనుండి సంతత ధారలతోఁ బ్రవహించు సెలయేటిధారలఁ దోఁగి తోఁగి ప్రాణములు హాయిమన నివురు

జొంపముల మురువుసూపు తరునికరంబులక్రిందఁ గొండొక సేపు విశ్రమింపని వాఁడుండఁడు.

అది హిమవంతమునపొంత వనాంతభూమిగాఁ గన్పట్టును గాని యందు హిమకళంకము సుంతయులేదు. అచటి చిత్రవిచిత్ర గైరికధాతువులు రత్నమందు సానుఫలకంబులుగాఁ దోఁచుచుండును. ఎప్పట్టునఁజూచినను ఆ కొండలోయలలోఁ గల పచ్చికబయళ్ళలో మందలు మందలుగా మేయు బాలహరిణంబులును, బాలహరిణంబులతో మేలంబులాడు చెంచుబాలకులును, చెంచుబాలకులతో ముద్దుముచ్చటలాడు చెంచెతలును, చెంచెతలతో మధురాలాపములాడు పికంబులును నేత్రపర్వం బొనర్చుచుండును.

పదక్రమము తప్పక పఠింపఁబడుచున్న వేదధ్వనులును, హవిర్ధూమంబులును, స్వాహాశబ్దంబులును, పూర్వపక్షసిద్ధాంతంబులచే రేఁగు వేదార్థమీమాంసకగోష్ఠీనినాదంబులును, అది తపోవనమని చెప్పక చెప్పుచున్నది.

ఆవనములోఁ గుతపకాలము నందొక్క కోనలోఁగల దరీముఖంబున నొక యోగిపుంగవుఁడు రాజయోగంబు మెఱయ రసాలసాలముక్రింది శిలాఫలకంబుపైన నిలిచి శ్రవణసుఖంబుగా సామగానంబులు సేయు చిలుకల పలుకుల నాలించుచు, బ్రాహ్మణశ్రేష్ఠులు పెట్టు భూతబలులను నీవారపిండంబులను భక్షించుచు నొక్కటఁగలసి యాడు పిల్లులను ఎలుకలను గాంచుచుఁ దన్మయుఁడై యుండెను.

వాని కుడిచేత నొక కమండలువును ఎడమచేత నొక తాటియాకుల పాత్రంబును గలవు. అతఁడు ధరించిన కావి కుబుసము వాని సహజ సౌందర్యమునకు వన్నెవెట్టుచున్నది. ఆతని వెనువెంటనే కనుచూపుమేరవఱకు మడిచేతులుపట్టి నిలిచిన మనుష్యు లనేకులు కన్పట్టుచున్నారు. వారందఱు నా రాజయోగి యడుగుజాడలలోఁ గనుసన్నలలో మెలఁగువారనుటకు సందియ మావంతయుఁ దోఁచుటలేదు. 'ప్రతివాని' మొగము లోను సత్వగుణము తాండవించుచున్నది. బ్రహ్మతేజస్సు ఉట్టిపడుచున్నది. వారు భిల్లులో బ్రాహ్మణమల్లులోఁ బోల్ప శక్యముగాకున్నది. ఎవరైననేమి? అందఱు బ్రహ్మస్వరూపులు, ఈశ్వరమూర్తులు. వారచ్చట నిలిచియుండఁగనే సుమా రెనుబదియేండ్ల వయసుగల యొక ధీశాలి యచ్చటకు వచ్చెను. యోగియు నాతఁడును ఒకరికొక రెదురుగాఁ దారసిల్లిరి. ఆ హఠాత్సంయోగములో నేమి మాయ యిమిడి యున్నదియో యొక్కమా ఱిఱువురును గంపించిరి.

యోగి ప్రశాంతదృష్టితోఁ గాంచెను. వృద్ధుఁడు సన్నిహితుఁడై నిలిచెను. పరికించిచూచి కన్నీళ్ళు కార్చెను. యోగి చిఱునవ్వు నవ్వి చేతితోఁ దడియొత్తెను. వృద్ధుఁడు చేతిని గనుల కద్దుకొనెను. క్షణకాల మిరువురకు మాట రాలేదు. ప్రగాఢ ప్రణయ ప్రశాంతి యేర్పడెను.

వృద్ధుఁడు:—ఏమీ రామరాజుబాబూ! నీతర్కవేదాంత పఠనంబున కిదియా ఫలితము?

యోగి:— ఇదే.

వృ:— ఇదియేనా? మఱేమీ లేదా?

యో:— అంతా మాయ.

వృ:—బాబూ! ఎంత శుద్ధవేదాంతివైతివోయీ! శత వృద్ధుడైన తండ్రిని, జాలాలైన భార్యను, తోడఁబుట్టువును విడిచి పుచ్చుట ధర్మమని యే వేదాంతగ్రంథము చెప్పినదోయీ!

యో:—మీతల రాజకీయములతో ముగ్గిపోయినది. మీబుద్ధి యర్థశాస్త్రములలో లీనమైపోయినది. మీకును మోక్షమార్గమునకును ఎంతదవ్వు! రాజ్యాంతమందు లభించున దేమి?......అని యదృశ్యుఁడయ్యెను. వృద్ధుఁడు నిశ్చేష్టుఁడై నిలిచెను.

అంతలోనే పల్లకీమోయుచున్న బోయీలమోఁత వినవచ్చెను. ఆమోఁతలోని కొన్ని స్వరములు ఈవఱకు విన్నవివలె నుండుటచే వాని దృష్టి యటు మరలెను. క్షణ కాలము అంతయు స్తబ్ధత. ఉత్తరక్షణములోఁ బల్లకివచ్చి యచ్చట వ్రాలెను. బోయీలు పల్లకీదింపి యావృద్ధునిఁజూచి యానందభయవిహ్వాలులై ప్రక్కప్రక్కల కొదిఁగి యొదిఁగి వంగి వంగి నమస్కరింపసాగిరి. వృద్ధుఁడుగాద్గదికస్వరముతో ఆకంపితాంగముతోఁ బల్లకిచెంత కేఁగి మోఁకరిల్లెను.

వెంటనే యిరువురు వ్యక్తులాపల్లకీనుండి బైటకువచ్చిరి. అందొకరు దివాంజీ! యని వృద్ధుని సంబోధించి మూర్ఛిల్లెను. మహారాజా! యని మంత్రి నిలువునసీరై చతికిలఁబడెను. మూఁడవ వ్యక్తి కొయ్యఁబాఱిపోయెను.

కొండొక నేపటికి నందఱుకు దెలివి గాంచిరి. దివాన్ వెంకయ్య వెంటనే చేతులు జోడించి—

ప్రభూ! తాముకూడ దయచేయువలయునా! నా ప్రభు భక్తిని శంకించుచుంటిరా? ఆచార్యులవారినికూడ వెంటఁబెట్టు కొని వచ్చినారా? ఏలినవా రెఱుఁగనిది లేదుగదా! అమ్మాయి గారు, కోడలుగారు కోటలోనా? మనమంతా యిక్కడనా? దుర్గరక్షణము?

మ:—దివాంజీ! భయపడకుము. రుస్తుంఖాన్ ఉన్నాఁడుగా నమ్మినబంటు.

ది:—ప్రభూ! అతఁడు గోలుకొండ పాదుపాల ......

మ:—ఔను. అయితే?

ది:—చిత్తము. చిత్తము.

మ:—నాకుఁ జీటి పంపినపిమ్మటి విశేషమేమిటి?

ది:—ఏమున్నది ప్రభూ! నాఁటినుండి నేఁటివఱకుఁ దిన్న చోట నిద్రింపకుండ నిద్రించినచోటఁ దినకుండ గుట్ట గుట్ట మిట్ట మిట్ట, పొద పొద, కోన కోన, గుహ గుహ తెగ వెదకితిని. ఎక్కడను బాబుగారిజాడ కానరాలేదు. కాని నేఁటి మట్టమధ్యాహ్నము హఠాత్తుగా నిదిగో ఈయున్న తావుననే యీశిలాఫలకముమీఁదనే యీ చెట్టుక్రిందనే బాబుగారి దర్శనమైనది. చెంతకేఁగి చేతులుజోడించి 'యేమి బాబూ! యీలా చేసినారు ధర్మమూ' యని ప్రశ్నించినాను. అంతా మాయ యన్నారు. అదృశ్యమైనారు. వారితో నున్న మనుష్యులు అదృశ్యులైరి.

ఇచ్చటి యాశ్రమమును అదృశ్యమయ్యెను. ఇది కలయో, వైష్ణవమాయయో యెఱుఁగరాకున్నది. వెడలుచు వెడలుచుఁ జేతనున్న యీ తాటాకులపుస్తకము నాచేతి కిచ్చినారు. ఇది యేమిటో విప్పిచూడలేదు. చేతిలోని పుస్తకమందుకొన్నానో లేదో కనుమొఱంగినారు. అదిమొదలు ఇప్పటిదాఁకఁ దిరిగి తిరిగి వేసారినాను. అగపడినవారి నెల్ల నడిగినాను. ఆశ్రయించినాను. బ్రతిమాలినాను. బామాలినాను. ప్రతివాఁడు చూచినానని చెప్పువాఁడె కాని బాబుగారి యునికిమాత్రము ఎవ్వరును జూపలేదు. చెప్పలేదు. తిరిగి తిరిగి యిచ్చటికే సంజవేళకు వత్తురేమోయను నాశతో వచ్చినాను. నాయాశ నిరాశయైనది. ఏమిచేతును? ఎందుఁజొత్తును? 'దారి తెన్ను' కానవచ్చుటలేదు. ఒకనాఁడు కొండపోడులలోని పైరులఁజూడవత్తురఁట. ఒకనాఁడు జీలుగు, తాడి, ఈఁత, ఇప్పచెట్లను నఱకింతురఁట. ఒకనాఁడు చందనవృక్షములను, టేకుచెట్లను, అనానమొక్కలను నాటింతురఁట. ఒకనాఁడు వాఁగునీటికి నాళిక లేర్పఁడఁజేసి వరిమడులకుఁ బాఱఁజేతురఁట. ఎవ్వరిని గల్లు త్రావనీయరఁట. చుట్ట కాల్పనీయరఁట. అందఱు నాయన యన్నఁ బడిచత్తురు. అంతా రామమయము. జగమంతా రామమయముగా నున్నది. ఒక్కొక్కప్పుడు చెట్టుకొమ్మలపైఁ గులాసాగాఁ గూరుచుందురఁట. ఒక్కొక్కప్పుడు సెలయేటిధారలలోఁ గ్రుంకులిడుచుందురఁట. ఒక్కొక్కప్పుడు వనమయూరనృత్యములను దిలకించి పులకించి తాము నాడుచుందురఁట. పాడుచుందురఁట.

ఒకొ్కక్కప్పుడు భిల్లబాలకులను జేరంజీరి పప్పుబెల్లములుపెట్టి బుద్ధులుకఱపుచుందురఁట. బాబుగారిచ్చటకు వచ్చినదాది యీ తోఁటపల్లికొండలు నిజముగాఁ దోఁటలు పల్లెలుగల కొండలై సార్థకతఁగాంచెను. అంతకుమునుపు ఇందెందును నరసంచారమే లేదఁట. ఏమిచేయుమందురు? ప్రభువులు మార్గాయాసమునం జేసి శ్రాంతులై యున్నారు. ఇంచుక విశ్రాంతి తీసికొనుఁడు. తరువాతఁ జూచుకొందము దయచేయుఁడు. ఈప్రదేశ మంత వాసయోగ్య మైనదికాఁదు.అదే నా పటకుటీరము. ఆప్రక్క లోయ కించుక పై భాగమునను్నది. అచ్చటికి దయచేయుఁడు.'

అని బోయీలవంకఁ జూచెను. వెంటనే బోయీలు పల్లకీనెత్తిరి. దివాన్ వెంకయ్య యశ్వారూఢుఁడై ముందు మెల్లమెల్లఁగా దారిచూపుచుఁ జనెను. పల్లకీలు దింపఁగానె మెల్లగా మహారాజు దిగి డేరాలోనికిఁ జనెను. ఆచార్యుల వారును ఆప్రక్కనే బసచేసిరి. అప్పటి కింకను రెండున్నర గడి యల పొద్దున్నది. ప్రయాణశ్రమ దీఱునట్లందఱును స్నాన ములుచేసిరి. అంతలో దివాను ఆజ్ఞచే ఆరుబయటఁదివాసీలు పఱవఁబడెను. ఒక్కచోటఁ బ్రత్యేకముగా వెనుక నొక మొగమల్ దిండును, బ్రక్కల రెండు పట్టుతలగడలును అమర్ప బడియుండెను. అరగడియ సేపటిలో మహారాజు వచ్చి యచట నాసీనుఁడయ్యెను. తిరుమలాచార్యులవారును, దివాంజీయు మహారాజునకుఁ గుడి ప్రక్కఁగా గూర్చుండిరి.

మహారాజు దివానువంకఁజూచిఁ 'ఏదీ దివాన్‌సాహేబ్!'

అనఁగానే యాతఁడు చిత్రమని తాటియాకుల పొత్తమును ఆచార్యులవారి కందించెను. ఆచార్యులవారు ఒక్కొక్క పత్రమునే విప్పిచూచి కన్నుల నీరుపెట్టుకొనుచుండెను. మహారాజు ప్రకృతి గంభీరుఁడు గావుటచే 'ఏమది యాచార్యులవారా!' అని సాభిప్రాయముగాఁ బ్రశ్నించెను.

తి:—ప్రభూ! ఇది వరసావిత్రీ చరిత్ర ప్రబంధము. ఎంత మృదు మధురముగా వ్రాసినారు ప్రభూ! సంగీతము కవిత్వము నేర్చుకొన్న వచ్చునవి గాదుగదా ప్రభూ! ఏమిధార! ఏమిశైలి! ఏమిశయ్య! ఏమిధ్వనులు, ఏమి వ్యంగ్యములు ఏమి ప్రసాద గుణము. ఏమియలంకారసంపద. చాల చక్కఁగా వ్రాసినారు ప్రభూ! మన పట్టాభిరామునకే యంకిత మిచ్చినారు. గురుస్తుతి మొదలుగా వంశాభివర్ణనముతోఁ బీఠిక పూర్తిగావించినారు. ఎంతఖలముగాని కృతి రచించినారు ప్రభూ! క్షత్రియకవియైన కృష్ణదేవరాయల యాముక్తమాల్యదకుఁ బ్రతిబింబముగా నుండవలెనని కాఁబోలు శ్రీమహావిష్ణువు సకలాయుధంబులను స్తోత్రముచేసినారు. ఆశ్వాసాంతములయందు గద్యముల వ్రాయక రాయలవలెనే పద్యముల వ్రాసి ముగించిరి. అవధరింపుఁడు. పితృపాదులగు తమ్మెట్లభివర్ణించినారో శైలి కొక్క పద్యముచదివి తరువాత నెడ నెడ నొక్కొక్కపద్యము, పాదము చదువుదును. పిమ్మట అబ్బాయిగారి దర్శన మగుదాఁక నిదే పురాణకాలక్షేపము చేతము.

"శామత్ఫ్మావర రంగభూవిభుని జాగ్రజ్జైత్రయాత్రామహో

ద్దామానేక తురంగ శాత ఖురఘాతక్షోణి రేణుచ్ఛటల్
వ్యోమంబెల్లనుగప్ప సప్తమునులత్యుత్కృష్టమోదంబునన్
ధామస్థానము గల్గెనంచు నతనిన్ వర్ణింతురోకృష్ణమ్మడిన్."
'ఏఘనరణభేరి కాఘుభాంకారంబు
కారంబు శాత్రవకర్ణములకు............
కలుషములువాసె శుభనముత్కరములెసఁగ
... ... ... ... ... రంగవిభుఁడు
సిరులు మీఱంగ రాజ్యంబు చేయునపుడు.
'లాలిత బహుభాగ్య లక్షణుం డాకర్ణ
పీక్షణుం డార్య నంరక్షణుండు... ... ...
రాజమాతుర్యిండె శ్రీరంగరాజ విభుఁడు
భటహేతి దీప్తిశంపా వ్యాప్తి నహిత పు
న్నాగరాజులు బిలాంతరము చొరఁగ.
'కంఠీరవ ప్రభాకమనీయమయ్యును
విబుధవారణముతో వియ్యమంది!
అద్భుతలీలఁ జరించునార ... రంగవిభు నతి స్వచ్ఛకీర్తి.
ఓడలమీఁద నేనుఁగుల నుజ్వాల తేజముతోడఁ దెచ్చె న
ప్రమాడభినందితంబులగు మాడుగులన్ భువనేశ్వరంబులన్
మేడలఁగట్టె నోర్వని యమిత్రులనెల్ల నడంచె నన్మనీ
షీడితకీర్తి రంగధరణీశ్వరమౌళికి సాటియేనృపుల్'
చిత్తగింపుఁడు ప్రభూ! మాతృశ్రీ గారిని ఎట్లభివర్ణించినారో?
'చతురాస్యుఁగళ్యాణ నమయంబునందునే

వాచాలకునిఁజేసె వాక్పురంధ్రి

... ... ... ... ...

అనుచు వారలఁగాదని ఘనత మెఱయఁ
బలికనేక మదానేకప జవనాశ్వ
గురువచో హేమరజతంబుగూర్చి రంగ
విభున కుచిత గుణాలంబ వేంకమాంబ.

'శ్రీవత్సాంక కృపానివాసుఁడగు నాశ్రీరంగధాత్రీధవుం
డావేంకాంబికయందు సర్వజనతాహ్లాదప్రదున్ మిమ్ము
శ్రీవర్ధిల్లఁగఁగాంచె భాగ్యగరిమన్ శ్రీరామరాజాగ్రణీ'

ఆపద్యము వినఁగానె మహారాజు కను లప్రయత్నముగా మూఁత పడినవి. తెప్పపాటులోఁ జప్పునఁ దెరవఁబడినవి. ఆచార్యుల వారదికని 'ప్రభూ! సెలవా!' అన్నాఁడు. మహారాజు ఆకాశము వంకఁజూచినాఁడు. దివాన్ వెంకయ్య ఆచార్యులవారూ! మఱో రెండు మూఁడు పద్యాలు చదివి ముగించుఁడు. ఏదీ అశ్వపతి తపోఘట్టము.

తి:– 'రాజహంసాభిఖ్య తేజంబు నొందఁగాఁ
బద్మాసన ప్రౌఢిఁ బరిఢవిల్లి
భూభృత్సమాఖ్య సంపూర్ణమై వెలయ ని
శ్చలతా విభూతిచేఁ జాల నలరి
జగతీశనామంబు సహజమై చెలువొంద
విగ్రహచక్ర సమగ్రతఁ దగి
యినుఁడనిమెడు పేరు వినుకలిగాఁగ

సీరంధ్రితమో విచారణత నమరి
రాజశేఖరసంజ్ఞ విరాజిలంగ
హిమవదచలేంద్ర గుహాసాహసమునం దనరి
యచటి జడదారి తుట్టుములౌరా యనంగం
దప మొనర్చె మహిపాల తల్లజుండు.'

పద్యముచదివి యాచార్యులవారు దివానువంకం జూచెను. దివాన్ చేయిత్రిప్పి తలయూంపెను. మరల నాచార్యులవారు

'కాశిలో మావారు గడియించి రీ పుత్రి
జీవిపూసలందాల్పు చెలువయనుచు
మూలికలున్నవి జాళువా తాయెతుల్
నెమ్మి సందిటం గట్టుకొమ్మటంచు
కానుపుశుభము లెక్కలదేవి రూపిది
యఱుతం గీలింపు తొయ్యలి యటంచు
కొండమల్లయ్యచేం గొనిన ప్రసాదంబు
చూచి దీవించి యీ సుదతి యనుచు
రాచకలువల చెలికాని రాణివాస
మునకుం బురిం గాపురంబున్న పుడమివేల్పు
పైడిమవలమిన్న లెంతయు నబ్బురముగ
నంగరక్షలు గావింతు రను దినంబు.

ఆపద్యము వినంగానే మహారాజు కనుంగెలంకులు చెమ్మగిల్లెను. కొనగోళ్ళ నశ్రుజలములు విదల్చుట చూచి దివాను నిట్టూర్చి సైంగచేయుంగా ఆచార్యులవారు తాళపత్రములు నవరించి త్రాడు చుట్టిరి.

——

## ౪

## 'గురువరు లేరు లేని తనకోటను జానకి గాంచెఁ బుత్రునిన్'

అప్పుడే యర్థరాత్రి కావచ్చెను. ఊరంత మాటుమణఁగి చాల సేపైనది. మొగలితుర్తికోటలో మాత్ర మెవ్వరు నిద్రింపలేదు. సేవకు లటు నిటు తిరుగుచున్నారు. జ్యోతిష్కులు మొగసాలయొద్దఁ గూర్చుండి ఘటికాయంత్రములు గాంచుచున్నారు. నక్షత్రగతులనారయుచున్నారు. వందు వెన్నెలలోఁ బాదచ్ఛాయలు వేయుచున్నారు. ఒక వృద్ధదాసి పరుగుపరుగున వచ్చి రుస్తుమ్‌ఖాన్‌గారిని పిలిపింపుఁ డన్నది. వెంటనే జోడు గుఱ్ఱాలబండి సిద్ధమైనది. క్షణములో రుస్తుంబాదాలో వాలినది. ఏక్షణమున కాక్షణము వార్తాహరులు అంచెలమీఁద వెళ్ళుచునే యున్నారు. శుభవార్తకై వేచియుండుటచే కాఁబోలు రుస్తుమ్‌ఖాన్ అప్పటి కింకను నిద్రపోలేదు. హుక్కాపీల్చుకొనుచుఁ బర్యంకముపైఁ గూర్చుండియున్నాఁడు. బండి వెళ్ళి గుమ్మములో నిలిచినది. ఉలికిపడి లేచి నాఁడు. ఏమి? ఏమి? యనినాఁడు. "ఏమిలేదండీ! సెలవైనది రమ్మని"

రు:– కోటకే ?

రా:– చిత్తము!

రు:– ఏమీ తొందరలేదుకదా ?

రా:– తొందరలేనిచో తమదాఁకా ఎందుకండీ!

రు:– అది కాదోయీ ......

రా:– ఏమోసామీ! పెద్దదాసీ పేరమ్మ ఒగర్చుచువచ్చి

ఖాన్‌గారిని దీసికొనిరండు అన్నది. సరే డఫేదారు ఆజ్ఞాపించి నాఁడు. నేను బండి తీసికొని వచ్చినాను. మఱి ఏమి సెలవు?

రు:— ఇదిగో ఉండు. వచ్చుచున్నాను. ఎందులకైనా మంచిది క్రొత్తగావచ్చిన యునానీవైద్యుని ఒలందవైద్యునిఁ గూడఁ దీసికొని పోద మని లోనికి వెళ్ళుచు ఒలందవైద్యుని తీసికొనిరమ్మని భటున కాజ్ఞాపించి, ఉడుపుల మార్చుకొని, బండియెక్కి, యునానీవైద్యునిగూడ బండి యెక్కించుకొని మొగలితుర్తి కోటకు వచ్చెను.

అప్పటి కింకను జాము రాత్రిపైగానున్నది. కోటలో అలజడి తగ్గలేదు. దాసదాసీలు ఊరకే కాళ్ళుచేతులు విఱుగఁ ద్రొక్కుకొనుచున్నారు. ఖాన్ మెల్లఁగా లక్ష్మీవిలాస మందిర ప్రాంగణమునకు వెళ్ళి నిలువఁబడినాఁడు. అంతఃపురమునుండి రాత్రివేళయగుటచే మెల్ల మెల్లని మూలుగు వినవచ్చుచున్నది. క్రమముగా మూలుగు హెచ్చుచున్న దేగాని తగ్గినట్లు విన వచ్చుట లేదు.

ఇంతలో తలుపుదగ్గర గదిలో "తమ్ముఁడు పోతే పోయి నాఁడు. దివాన్‌గారు నాయనగారుకూడ వెళ్ళవలెనా? ఇటు వంటి సమయములో, ఎంత ఐశ్వర్యమున్న నేమి? ఎంత రాజ్యమున్న నేమి? అంతా అడవికాచిన వెన్నెల. ఆచార్యుల వారినైన అట్టిపెట్టినారా? బాబాజీగారు. వారున్న చో ఏ మంత్రపునీళ్ళో, ఏ రక్ష రేకో యీయకపోవుదురా? ఈ పాటికి పురుడు రాకపోవునా? తొలిచూలు బిడ్డ.......... అని

ఈకెలుంగున అనుకొను మాటలు స్పష్టముగా వినవచ్చుచున్నవి. అవి రుస్తుమ్‌ఖాన్ చెవిలోఁ బడెను. వెంటనే ధైర్యము తెచ్చుకొని ఖాన్ ఒక అడుగు ముందునకు వేసి మరల నంతలోనే వెనుకకు వేసి కొంచెము బిగ్గరగా నడఁకువతో "అమ్మాజీ! సర్కార్! ఆజ్ఞను బాలింప మేము సిద్ధముగా నున్నాము. సెలవీయుఁడు.'

జవాబు లేదు.

రు:— అసూర్యంపశ్యలు రాజపుత్త్రికలు. పొరపాటు చేసినాను—చేసినాను. అమ్మాజీ సర్కార్ క్షమింపుఁడు. మాతృభావనతో మనవిచేసికొన్నాను. విన్నవించుకొన్నాను. ఔచిత్యమును మీఱలేదు. ఆజ్ఞలను దలఁ దాల్చెదను. ఒక్క మనవి "నాతో నొకరొయిలందవైద్యుని, ఒక యునానీవైద్యునిఁ దీసికొనివచ్చినాను. ఇద్దఱును ఘనవైద్యులు. తమ సెలవైన మందునిచ్చెదరు. జానకీదేవిగారు సుఖముగానుందురు".

అ:— ఓహో! రుస్తుమ్‌ఖానా! ఈయర్ధరాత్రివేళ నెప్పుడు రాక?

రు:— అమ్మాజీ సర్కారు సెలవయినదఁటగా?

అ:— ఔనౌను. పేరమ్మ కంగారుపడి కబురుపెట్టినది కాఁబోలు.

రు:— జీ!

అ:— మాకుఁ బరదేశవైద్యులచే వైద్యముచేయించుకొను నాచారమంతగా లేదు.

రు:- కాదు తల్లీ! చేయించుడు. పోనిండు ఈమందు వేయింపుడు. ఇది ఢిల్లీనుండి గోలకొండవచ్చిన మహౌషధము. అని మందు లోనికిఁ బంపెను.

అమ్మాజీ మహారాజు రంగరాజు పుత్రికారత్నము. విజయనగరాధీశ్వరుఁడగు నానందమహారాజుగారి భార్య. వీరి కుమారుఁడే విజయరామమూర్తిగజపతి. ఆయానందభూపతియే విజయసంవత్సరము, విజయదశమి, జయవారము, విజయనగరము, విజయరామమూర్తి యను నైదు జయశబ్దములతోఁ గూడిన సన్నివేశమున విజయనగరమునఁ గోటకట్టించిన మేటి వజీరు.

ఈ మహారాజుల యిద్దఱిపేరుకన్న అమ్మాజీపేరన్న నశేషజనమునకు అదులు. ఆమె 'యతిగా' సంభాషింపదు. అన్యదేశస్థులన్నను, అన్యమతస్థులన్నను ఆమెకుఁ దలమంట. పరాధీనతకు సహింపదు. గంటము పుచ్చుకొని వ్రాయఁ గలదు. కత్తి పుచ్చుకొని వైరులఁ దునుమఁగలదు. ఆమె నరనరమున లోచనెత్తురు పాఱుచుండును. చిన్ననాఁటినుండి కలిదిండికోటలో నున్ననాఁటినుండి యామె యనేక యుద్ధములు గన్నులారఁ గాంచిన వీరవనిత. రాజ్యాంగతంత్రములను ఓడి యొడఁబోసిన విషయజ్ఞ. రామరాజులుంగారికంటెఁ బెద్దదగుటచేఁ దఱచు మహారాజు తన విజయములు శత్రువుల యెత్తుగడలు తన రాజ్యాంగచతురత పూసగ్రుచ్చినట్లు పుత్త్రికకుఁ జెప్పుచుండెడివాఁడు. ఎప్పుడైన క్లిష్టసమయములలో నామె

వలపాల నందుచుండెడువాఁడుకూడ. ఆమె ఏవిషయమైనసరే క్షణములో నూహించి యొకనిర్ణయమునకు వచ్చు ధీశాలిని. ఆమెయోచన యెన్నఁడు వ్యర్థమైనట్లు లెవ్వరును విన్నదిలేదు. మఱఁదలికిఁ బుట్టిరోజులని. తమ్ముఁడు తపస్సునకేఁగినాఁడని, విని యామె విజయనగరమునుండి యిక్కడకు వచ్చినది. ఆమె వచ్చిన కొలఁదినాళ్ళకే యామె యున్నదికదా యను ధైర్యముతో మహారాజు పుత్త్రాన్వేషణమునకై బయలుదేఱివెళ్ళెను. నామమాత్రముగా రుస్తుంఖానుమీఁద రాజ్యభారము మోపఁబడెనేకాని, యమ్మాజీ యాజ్ఞలేనిది యాకల్లాడుటకువీలులేదు. బాహ్యవిషయము లన్నియు రుస్తుంఖానుమీఁదనే నడచుచుండెను. అతనిపైఁ గోటలోని భటులకు సైనికులకు భక్తివిశ్వాసములున్నవి. అతఁడు మహారాజునకు మనుమఁడు కలుగవలయునని యుబలాటపడుచునేయున్నాఁడు. ఆ శుభవార్త వినఁగానె పంచిపెట్టవలెనని, మణుగులకొలఁది కస్తూరి, ఖర్జూరఫలములు, పటికబెల్లముగ్గూడ బండిలో వేసికొని వచ్చినాఁడు. మహారాజుగారి రాజనీతివిశారదత్వమునకు మురిసి ముప్పందుము త్రాగుచు వారివంశము దానితోపాటు తన హోదా హెచ్చవలెనని ముచ్చటపడుచు నుండును. అప్పుడప్పుడు మధుపాన మత్తుఁడై హుక్కాఁ త్రావుచుఁ దన నవాబుల చలువయే రంగరాజుమహారాజు నైశ్వర్యాభివృద్ధికిఁ గారణమని తనదే సరియైన పరిపాలకజాతియని తానైన నీరాజ్యము నింకను వృద్ధి చేయఁగలనని యనుకొనుట మానలేదు. మైకము తగ్గఁగానే

తన యశక్తతను గుర్తించుకొని, పైకిఁ దన తలంపులు తోఁప
నీక మహారాజునకుఁ నమ్మినబంటై యాయన చెప్పుచేఁతలకై
మడిచేతులుపట్టి, కనిపెట్టుకొనియుండును. ఈతని యాహార
విహారచేష్ట లెంత నిగూఢములుగానున్నను, మహారాజు వాని
విషయమై జోక్యము కల్గించుకొనకున్నను, అమ్మాజీ పుట్టింటికి
వచ్చినపుడెల్లఁ జారముఖమున, నారయుచునేయున్నది. ఎప్పటి
కైన నాతఁడు విషపూరితుఁడు కాఁగలఁడని, యామె కనుమాన
ము. అందుచేత నేమహారాజుతో నప్పుడప్పుడురుస్తుంఖాన్ ఉత్తర
పుఁబరగణాలోని హసన్ బాదాకు, హసన్ ఖాను, రుస్తుంబాదాకు
వచ్చినచో బాగుండునని సూచించుచుండెడిది. హసన్ ఖానెంత
ధారాళహృదయుఁడో యెంతనిష్కపటియో, యెంత సర్వమా
నవ సౌభ్రాత్రముగలవాఁడో రుస్తుమ్ఖా నంత కుటిలహృద
యుఁడు, కపటి, స్వమతాభిమాని, యంత మానవత్వరహితుఁడు
నని యామె తలఁపు. అదను దొఱికినప్పుడెల్ల నమయము
చిక్కినప్పుడెల్లఁ దన యభిప్రాయమ్మును బలపఱచుకొనుటకుఁ
దార్కాణములు వెదకుచునే యుండెను.

మలికోడి యింకను గూయలేదు. అయినప్పటికీ
దేవిడీపైఁ బంచమహాశబ్దములు మ్రోఁగినవి. నౌబత్ఖానా
యొత్తఁబడినది. అంతఃపురమునుండి శంఖారావములు
బయలుదేఱినవి. కోటంతయు దివ్వటీలతో దేదీప్యమాన
ముగా వెలుఁగఁజొచ్చినది. సుధారకమహాలుపై సూర్యపతాక
రెప రెప లాడుచున్నది. అగరుధూపధూపితంబై కస్తూరికా

కర్పూరపరిమళ పరిమిళితంబై ప్రభాతవాయువు సర్వజన హృద యాహ్లాదకరంబుగా మందమందముగా వీచుచున్నది.

కుక్కుటములు జయహేషలు చేసెను. ఏనుఁగులు శుభ ఘీంకారములు సలిపెను. రుస్తుమ్‌ఖాన్ తాను దెచ్చిన కస్తూరికా కర్పూరములు, ఖర్జూరఫలములు, కలకండముక్కలు పంచిపెట్టఁ దొడఁగెను. కార్తాంతికులు వికసితముఖారవిందులై పంచాంగ ములు విప్పి తిథి వార నక్షత్ర యోగ కరణముల నారసి గ్రహకూటము నిర్ణయించి జాతక చక్రములిఖించి చూచిమాతృ గండమున్నదని నవగ్రహశాంతి చేయవలెనని తమలోఁ దాము మెల్ల మెల్లగా ననుకొనుచుండిరి. రత్న భాండారమునుండి ముత్తైదువలు పైఁడిపళ్ళెరములలోఁ బట్టుపుట్టములు పచ్చ కర్పూరములు కస్తురికా కర్దమంబులు, నాగవల్లీదళంబులు, పూగీఫలంబులు పెట్టుకొనివచ్చి బ్రాహ్మణ ప్రవరులగు జ్యోతిష్కులకు నొసంగుచు జానకీదేవిగారికిఁ గుమారుఁడు కలిగినాఁడు. సమయానికిఁ దండ్రిగారు, తాతగారు, దివాంజీ గారుకూడ లేరైరి. ఆతల్లి అమ్మాజీగా రుండఁబట్టిగాని యేమి కావలసినది. ఏదో విశ్వపతిశాస్త్రిగారూ! మీదయవల్ల మాగ శిశువు గలిగెను. అంతా తమ యాశీర్వచనబలమె. అమ్మాజీ సర్కారువారు అగ్రతాంబూలము తమ్మ స్వీకరింపుమని కోరి నారు. పిమ్మట వచ్చిన బ్రాహ్మణుల నందఱను సత్కరింపు మన్నారు. పురుడు వెళ్ళినదాఁకఁ దమ్ము ఇచ్చటనే యుండు మని సెలవిచ్చినారు. జాతక మెట్లున్నదో తెలిసికొని రమ్మ

న్నారు. అనఁగానే విశ్వపతిశాస్త్రియాసత్కారము లందుకొని, నరేమీరువెళ్లుఁడు. జాతకము బాగుగానే యున్నదని యమ్మాజీ గారితో మనవిచేయుఁడు. మిగిలిన విషయములు తెల్లవాఱఁ గానే చూచికొందము. అనఁగానే దాసీలు ఖానుసాహేబుగారి యొద్దకు వెళ్ళి అమ్మాజీగారి సంతసమును దెలిపి నవరత్నహార మును బహూకరించిరి. రుస్తుమ్‌ఖాఁ నది యందుకొని యానంద ముతో ధరించెను.

---

౭

"ఆంధ్రాకాశము చీఁకటిన్ మునిఁగె హాహాకారముల్ రేఁగఁగా"

అప్పటికప్పుడే యొక నెల దాఁటినది మహారాజు తోఁట పల్లికొండల కేఁగి. యిప్పటి కింకను అక్కడివార్తలిక్కడకుఁగాని యిక్కడివార్త లక్కడకుఁగాని తెలియ లేదు.

పురుడువచ్చినది మొదలుకోటలోఁ 'బ్రతినిత్యము' హోమ ధూమము లెగురుచునే యున్నవి. శివాలయములలో యథా శాస్త్రముగా మృత్యుంజయ జపములు జరుగుచునేయున్నవి.

రుస్తుంఖాన్ వచ్చుచుఁ బోవుచు నున్నాఁడు. ఏమి సుగ్రీవాజ్ఞయోగాని యందఱు సుఖముగా నున్నా రన్నవార్త తప్ప వాని కితరమేమి తెలియ వచ్చుటలేదు. కాని యొడ మొగము పెడమొగముగా నడచు నౌకరుల వాలకము వాని హృదయములోఁ బ్రవేశించి కలఁతపఱచుచున్నది. ఈ వఱ

కెప్పుడు పైనుండి రాజ్యాంగ విషయములు మాత్రమే కనుఁగొని పోవుచుండు వాఁడిప్పుడు కోటలోని 'తత్రాపి' యంతఃపురము లోని వార్తలను వినుటకై తత్తరపడవలసి వచ్చినది.

రుస్తుంబాదానుండి తీవిగా వచ్చి తీవిగా వెళ్ళుచుండుట యీవఱ కెల్ల మామూలు. కాని యీరోజున నాతఁడాభటుని ఈభటునిఁ జీలఁదీసి యేదో మంతనముచేసెను. కాలు కాలిన పిల్లివలెఁ దిరిగెను.

ప్రభుభక్తి పరాయణులయిన రాజభటు లది ముందు గానే కనిపట్టినారు. అమ్మాజీ కండఁ జేసినారు. అమ్మాజీ ఖాన్ తమకోటలోఁ బాదము పెట్టిననాఁటినుండి వీని ననుమానపు దృష్టితోఁ జూచుచున్నది. ఖానునకు మాత్ర మీవిషయ మావంతయుఁ దెలియదు.

నాఁటికి మహారాజకుమారికకుఁ బురుడువచ్చి యిరువది యొక్కనాళ్ళైనది. ఆనాఁడు డోలామహోత్సవము జరిపించుటకై విపుల సన్నాహములు గావింపఁబడెను. తండోప తండములుగా 'బ్రాహ్మణముత్తైదువలు' వచ్చిరి. సకలశాస్త్ర పురాణాగమేతిహాసవిదులగు బ్రాహ్మణు లరుదెంచిరి. ఒకమూల నాటలు ఒకమూలఁ బాటలు సాఁగుచున్నవి. కోటయంతయు నానావిధజనులతో నిండిపోయినది.

విశ్వపతిశాస్త్రి గంధాక్షతలు తీసికొని లోనికేఁగెను. శాస్త్రిగారిపోక కాఁక యెన్నడును లేదు.

దూరదూరమున నుండి రుస్తుంఖానిది యంతయుఁ

జూచుచునేయుండెను. ఎవరితోడను మనసు విప్పి మాటాడ లేదు. ఎవరిని దగ్గఱకుఁ బిలిచి యడుగలేదు. ఉత్సాహమించు కయు వానిలోఁ బొడకట్టుటలేదు. ఏమిమాట లాడిన నేమి తంటాలు వచ్చిపడునో యని వెనుకముం దాడఁ జొచ్చెను. అమ్మాజీ పేరన్న వానికి సింహస్వప్నము.

మఱి పదిగడియలలో నాలుగు మేనాలు అఱువది నాలుగుమంది బోయీలతోవచ్చి సరాసరి దొడ్డివాకిలిలో గుమ్మముదగ్గఱగా వ్రాలెను.

సంతర్పణలు సమారాధనలు యథారీతిగా జరిగిపోవు చున్నవి.

'కోడలిగారి తల్లిగారు బంధువులు వచ్చినారు. కట్నాలు కానుకలు తెచ్చినారు. సమయమునకు మహారాజులుంగారున్న నెంత బాగుగా నుండెడిది. యువరాజుగారి పెండ్లియైన తరువాత నిదే మొదటిసారి కోలంకవారు వచ్చుటకు.అన లీపురు డక్కడ పోయవలసినది యువరాజుగారు తపస్సున కేఁగుటచే నిల్చినది. ఇంతకు రాజుల కేమికొదువ? అబ్బా! యెన్ని వజ్రాలు, యెన్ని వైడూర్యాలు, ఎన్ని పచ్చలు తెచ్చినారు మనుమనికి. ఓహో యేమిరాచరూపులమ్మా!'యువరాణిగారి' కన్నఁదల్లిగారుమఱి యందగత్తె. ఆమెకూడ వచ్చినవా రెవరోగాని వారియందము చెప్పఁదరమే కాదు. ఇంకను సాయంకాలమునకుఁ దండ్రిగారు కూడ రావచ్చు ననుకొనుచున్నారు. ఇచ్చట సమయానికి మగవా రెవ్వరును లేకున్నను అమ్మాజీగారున్నారుగాన నన్ని

ముచ్చట్లు జరుగుచున్నవి. పైని రుస్తుంఖాన్‌గారుకూడ నన్ని విధాల నన్నిపనులు నెఱవేర్చుచున్నారు. ఆయన రాజభక్తిని అమ్మాజీగారెప్పుడు మెచ్చుకొనుచుందురు'. అని చెప్పుకొనుచు లోపలినుండి వచ్చిన ముసలిదాసీలు రుస్తుమ్‌ఖాన్ ప్రక్కనుండి వెడలిపోయిరి.

ఆమాటలు రుస్తుమ్‌ఖాన్ విన్నాఁడు. ఆనంద పరవశుఁడైనాఁడు. మొగసాలకడకు వచ్చినాఁడు. లోపలినుండి వచ్చు బ్రాహ్మణులను బిలిచినాఁడు. మహారాజులుంగారికి మనుమలు గలిగినందులకుఁదనకుఁగలిగిన యానందమును వెలిపుచ్చుచుఁ దనజేబులోనుండి కొన్నిరూకలు తీసి వారికిఁ బంచిపెట్టినాఁడు. సత్కారము లందుకొని బ్రాహ్మణు లందఱు నేకగ్రీవముగా "ఏమండీ రుస్తుంఖాన్‌గారూ! ఏమదృష్టమండీ మీది. అంతఃపురములో నేనోటివెంట విన్న మీప్రశంసయే. మహారాజులుంగారికి మీపైఁగల నమ్మకమునకు మీరు చేయించిన యేర్పాటులకు బలేబలే యెంత బాగుగా నున్నదండీ! మహారాజులుంగారిచ్చట లేని లోపమేమీ మీరుచేయలేదు. అంతా చక్కఁగా నున్నది. మఱి వెళ్ళివత్తుమా" యని యామంత్రణముచేసి బ్రాహ్మణులు వెళ్ళిన మఱి పది గడియలకు వచ్చిన పల్లకీలు వెంటనే తిరిగి వెళ్ళిపోయినవి.

జాముక్రిందటనే వచ్చినపల్లకీలు అప్పుడే తిరిగి వెళ్ళిపోవుట యేమిటా యని యాతని కేదో యనుమాన ముదయించెను. ఆందోళన బయలుదేఱెను. అక్కడినుండి మఱి నాలు

గడుగులు ముందునకు వైచెను. తటుచుగాఁ దనదగ్గఱకు వచ్చుచుఁ దన పారితోషికము లందుచున్న దాసీ పేరమ్మను బిలిచి 'యేమిటిది! అప్పుడే బంధువులు వెళ్ళిపోవుచున్నారే యొక్కరోజైన నుండకుండ' నని ప్రశ్నించెను.

పే:—అంతే ఖాన్‌గారూ! రాజుల మర్యాద; ఆచారము. అసలు రానే రారు. వచ్చినచో నొకజామో రెండుజాములో కంటె నుండరు. ఎంత దగ్గఱచుట్టాలు కానివ్వండి. ఒకపూఁట యైన నుండరు. ఇంక 'నయము'! అసలు ఆఁడువారు రానేరారు కానుకలు ఏ మాబోటి దాసీలచేతనో పంపుదురుగాని ఇంతకు రెండుమూఁడు తరాలనుండి వచ్చుచున్న ప్రాఁత చుట్టఱికము గనుక నీమాత్రమైనఁ జనవుతీకొని వచ్చినారు.

రు:—ప్రొద్దు అట్టేలేదు. ఇప్పు డెక్కడకు వెళ్ళెదరు?

పే:—ఏమిటి ఖాన్‌సాహెబుగారూ? అంచీలమీఁదఁ దెల్లవాఱకుండ వెళ్ళి కోలంకలో వ్రాలుదురు. రాజుదలఁచిన దెబ్బలకుఁ గొదువా! కాని రుస్తుమ్‌ఖానుగరూ! రాజులలో ఓ గొప్ప చిక్కున్నది బయలు దేఱినచోటునుండి మరల గమ్యస్థానము చేరినదాఁకఁ బచ్చిమంచినీళ్ళు పొరుగింటఁ దాగివరు సుమండీ.

అమ్మాజీగారు పేరంటాండ్రందఱు వెళ్ళుదాఁక నక్కడ నుండకపోయినఁ గోపపడుదురు. మీ రుండుడుగా నేనిప్పుడే వచ్చెదను.

రు:—తప్పక వచ్చెదవుగా పేరమ్మా!

పే:—అయ్యో! బాబయ్యా! యెంతమాట! ఇదంతా మీచలువేగా! మీరావేళ ఆ మందీయకపోయినచో ఈ ముద్దులు ఈముచ్చటలు ఈవైభవము జరుగునా; ఇప్పుడేవచ్చెదను. ఉండుఁడి రుస్తుంఖాన్‌గారూ!

'సరే వెళ్ళిరా' యని రుస్తుమ్‌ఖాన్ ఒక పడకకుర్చీలోఁ గూర్చుండి హుక్కా కొట్టుచుండెను. హుక్కా మైకము పక్కాగాఁ దలకెక్కినది. తూఁగుట కారంభించినాఁడు. అప్పటి కప్పుడే కొన్నిగడియలు దాఁటిపోయినవి. అంతఃపురము అంటు కొన్నట్లు గొల్లుమని యార్తధ్వని వినఁబడినది. రుస్తుమ్‌ఖాన్ త్రుళ్ళిపడి లేచినాఁడు. ఏమి టేమిటని చకచక నడచి లక్ష్మీవిలాస సౌధమునొద్దకు వెళ్ళినాఁడు. ఎడబొబ్బలు పెడబొబ్బలు మఱి యెక్కువైనవి. ఏమిటేమిటని రుస్తుంఖాన్ కలఁదిరుగఁ సాగెను. గడియసే పెవరు నేమీ చెప్పలేదు. మఱొకగడియకు "ఇంకేమున్నది రుస్తుమ్‌ఖాన్‌సాహెబుగారూ! జానకీదేవిగారు కొంప త్రవ్వివేసినారు. మహారాజుగారి కడుపుఁ జిచ్చు పెట్టినారు. చంటిబిడ్డను విడిచిపెట్టినారు. చచ్చి స్వర్గాన నున్నారు. కోటకేదో పట్టుకొన్నది సాహెబుగారూ!"

అమాటవినఁగా నే రుస్తుమ్‌ఖాన్ ఆశ్చర్యచకితుఁడైనాడు. వెంటనే మెఱపు మెఱసినచందాన వానిలో నాశాజ్యోతి ప్రవేశించినది. ఆజ్యోతి వాని రోమరోమమువెంట నగ్నిజ్వాలమై మండఁజొచ్చినది. 'ఏరీ! అమ్మాజీగా రెక్కడ?' యని యఱచి నాఁడు.

పే:—ఎక్కడ నుందురు సాహెబుగారూ! యంతఃపుర మందు ఆశవము దగ్గఱఁబడి నోరు నెత్తి బాదుకొని బాదుకొని యేడ్చుచున్నారు. ఇక్కడకు నెట్లు వచ్చెదరు? ఈవల కెవ్వాడైన 'నరమానవుని' కంటఁబడినారా ఆతల్లి; యీ యాపత్కాలములో నెవరికంటనైనఁ బడుదురా? చచ్చిన బ్రతికిన రాచవారికి నాయంతఃపురమే.

రు:—'పోనీ! ఆశిశువునైన నిచ్చటికిఁ బంపించుమను నేను పెంచి పెద్దవానిని జేయుదును. అమ్మాజీగారితోఁ జెప్పు నేను చెప్పినానని అని యఱచినాఁడు. ఆయఱపుతో వాని దుర్బుద్ధి యీదాసికి నర్థమైపోయినది. ఆశిశువును హతమార్చి యరక్షకమైయున్నకోటను దా నాక్రమించుకొనవలెనని తలఁచి నాఁడన్నమాట స్పష్టమైనది. వెంటనే తిరస్కారముతో 'ఊఁ ఆలాగునే చెప్పెదనులే' యన్నది. రుస్తుమ్ఖాన్ 'ఊఁ ఆఁ' అని యఱిమినాఁడు. ఆయఱుముతో నది పరుగెత్తి "అమ్మాజీ! అమ్మాజీ! రుస్తుమ్ఖాన్" శిశువును జూడవలె ననుచున్నాఁడు. ఉఱుముచున్నాఁడు. నిప్పులు గ్రక్కుచున్నాఁడు. మిమ్ము లను బిలువుమన్నాఁడు. మొల తడవుకొనుచున్నాఁడు. ఏదో పాపము తలపెట్టినాఁడు. వాని వాలకిముచూచిన నంతః పురములోఁ గూడఁ బ్రవేశించునట్లున్నది. అమ్మాజీ! యిఁక మీరు జాగ్రత్తపడవలెను. అమ్మాజీ! జాగ్రత్తపడవలెను. క్షణ మాలస్యము చేయకూఁడు" అన్నది లబలబ లాడుచు. అమ్మాజీ యేమీ చలింపలేదు. ఒక చిఱునవ్వును నవ్వెను. ఇది యిట్లు

జరుగునని యామె ముందుగానె యూహించినది. కనుక నే
తెప్పపాటులో రత్నభాండారమున కేఁగి యందు నిలువయున్న
లక్షవరహాల ధన కనక వస్తువాహన సామగ్రియొక్కయు,
నేనుఁగులు, గుఱ్ఱములు, పాలకీలు పాత్రసామగ్రియొక్కయు
లెక్కలుగల చీటిని జేతఁబుచ్చుకొని నవరత్నహారములను
మాత్రము తాను ధరించి క్షణములో మెఱపు మెఱసిన చం
దానఁ బాణిద్వారమున మహమ్మదీయ పురుష వేషముతో
నరణపు దాసితోఁగూడఁ గోటనుండి నిర్గమించెను.

జవా బెంత సేపటికి రాకపోవుటచే రుస్తుమ్‌ఖాన్ కారాలు
మిరియాలు నూఱుచుఁ బిచ్చియెత్తినవానివలె నటు నిటు పరు
విడి యహంకారముతో హుంకరించి మహమ్మదీయ సిపాయి
లనుగాంచి "ఆవో భాయియో ఆవో అబ్ సబ్ కిలా హమారా
హై. దేవిడీ బంద్ కరో. హమారా ఝండా ఉంచా రహే"
యని సింహగర్జనము చేసినాఁడు. ఆ యఱపుతో క్షణములో
'వానర మూఁక'వలె మహమ్మదీయ భటులందఱు నశనిచుట్టు
మూఁగినారు.

'అమ్మాజీని బంధింపుఁడు. శిశువును దీసికొనిరండు' అని
రుస్తుమ్‌ఖాన్ ఆజ్ఞవెట్టినాఁడు. ఇఁకఁ గావలసినదేమి యామహా
వీరులకు? 'చూడుఁడు! మా మజా యన్నారు' తలుపులు తెఱచి
లోపలఁ బ్రవేశించినారు. ఎల్లెడలఁ బరికించినారు. అంతిపుర
ములో నెక్కడ నొక్క యాఁడుపురుగైన గానరాలేదు.
నిప్పులుతొక్కిన కోఁతులవలె గంగివెఱ్ఱులెత్తి కోటలోఁ

'బ్రతికది,' ప్రతిభాగము నెమకినారు. నెమకినారు. ప్రళయకాల రుద్రులై రుస్తుంఖానునొద్దకు వచ్చినారు. విషయము విన్న వించుకొన్నారు.

అతఁడు 'శవమేమైనది? పిల్లవాఁడెక్కడ?' అని గర్జించి నాఁడు.

"నై నర్కార్" అన్నారు వారందఱు నేకగ్రీవముగా. 'సరే రం'డని వారిని దోకొని తాను గూడ స్వయముఁగ నంతఃపురము నలుకెలంకుల వెదకి యెక్కడ నెవ్వరును గనఁబడకపోవుటచే నావల కేయాతాయాతజనులు చూచుటకై తెఱవఁబడియున్న సుధాకరమహాలులోఁ బ్రవేశించినాఁడు. తాను పాదుషానని ప్రకటించుకొనినాఁడు.

వాని యాజ్ఞచే వెంటనే కోటలోని పట్టాభిరాముని దేవాలయ జయస్తంభాగ్రమున రెప రెప లాడు సూర్యలాం ఛిత హేమపతాక దైవదుర్విపాకమునఁ గ్రిందికిఁదిగినది. చంద్ర ధ్వజము పై కెక్కి తళతళ మెఱసి రెపరెప లాడినది. ఆంధ్ర నగరమైన మొగలితుఱ్ఱు ఇస్లాముపురమైనది. పంచమహాశబ్ద ములు మొరసిన రాజప్రాసాదపు మొగసాలపై ఢంకా నౌబత్తులు మ్రోఁగినవి. నల్లని చీఁకటు లాంధ్రాకాశము నలముకొన్నవి. ఆంధ్రశౌర్యాగ్ని పానుఁగుపడినది. మొగలి తుర్రి పతనముతో నాంధ్రుల స్వాతంత్ర్యభాగ్యరేఖలు దీప్తి మాసినవి.

---

౬

'రాజు గ్రసింపఁగాఁ బడియె రాహువుచేత జనంబు లేద్వఁగఁ'

మూలిఁగెడు నక్క పైఁ దాటిపండు పడినది. రోజులు గడచినకొలఁది మహారాజునకు వృద్ధత్వమునకు సాయము హృదయభారము అధికమగుచున్నది. సుఖపడెడు కాలములోఁ గష్టము లధికము గాఁజొచ్చినవి. ఒక వంకఁ గొడుకు గానరాలేదని చింతలవంతలఁజిక్కి కృశించుచుండఁగా వేఱొకవంకఁ గోడలు ప్రసవించి మరణించినదనియు మగశిశువు గలిగినాఁడనియు వార్త. కొడుకుఁ గోడలు తన్ను విడనాడినందులకు దుఃఖమా? కులాంకురమున్నాఁడు గదా యని సంతసమా? అంత కింతయైనది. ఇంత కెంత యగునో! ఈచిన్ని నిసుఁగు బ్రతికి బయటఁబడి పెరిఁగి పెద్దయై పట్టగట్టినప్పుడుగదా! తన కానందము. ఏనాఁటి ముచ్చటయో యది. అంతా స్వప్న వృత్తాంతము. ఆకాశహర్మ్యము.

ఏమిచేయును పాపము! దివాను నింకను నాలుగురోజులుండి చూచిరమ్మని యాచార్యులుగారినిఁ గూడ నట్టిపెట్టుకొనుమని తా సర్దుదారిని మొగలితుర్తికి బయలుదేఱెను. బోయీలకు హుషారిచ్చెను. వారును ఆమడ కొక యడుగువేసికొనుచుఁ బరుగిడఁ జొచ్చినారు. అదేమోగాని యూహవచ్చిన దాది యెన్నఁడును బిఱికితనమెఱుఁగని యామహారాజుగుండెలు నాఁడు దడ దడ కొట్టుకొన నారంభించెను. ఆ వీరపుంగవుని, ఆ దేశోద్ధారకుని ముఖములో నుత్సాహరేఖలు చూతమన్నను

గానవచ్చుటలేదు. ఏదో కడుపులో నాందోళన బయలు దేఱి నది. కొండలోయలలోని నీరు త్రావుటచే నీటిభేదము చేసిన దనుకొనెను. తన యదృష్టము నెన్నఁడు శంకించుకొని యెఱుఁగని యా మహాధీరుఁడు నాఁడేటికో యొకటి రెండు మాఱులు 'నా ముప్పెట్లుగడచునో నాముప్పెట్లుగడచునో' యని తలవని తలంపుగా నప్రయత్నముగా ననుకొనెను. ప్రయాణము ముందునకు సాగుచున్నకొలఁదియుఁ దన సీమ సమీపించుచున్న కొలఁదియు మహారాజున కాందోళన యింకను నెక్కువ గాఁజొచ్చినది. పల్లకి గ్రామములవెంబడి గ్రామములు దాఁటి పోవుచున్నను నెవ్వరును దాని నెవరిదని ప్రశ్నింపకుండునట్లుగాఁ బక్క ప్రక్కలుగాఁ బోండని మహారాజు నాజ్ఞ.

బోయీలు ఒక్క పరుగున గ్రుక్క తిరుగకుండఁగా 'ఓయి' 'ఊయి' అనుచు సాగిపోవుచుండిరి. కాని మహారాజునకుఁ బ్రయాణము సాగినట్లే లేదు.

రాజోలు కనుచూపుమేరలోనున్నది. అక్కడపడవనెక్కి మాధవాయిపాలెంలోఁ (నరసాపురము రేవు) దిగి హుటాహుటి మొగలితుర్తికోట చేరుకొనవలెనని యాత్రము చెందెను. రాజోలు సమీపించినకొలఁది యాయన కాందోళన మఱి హెచ్చుఁదొడంగెను. ఎప్పుడు పల్లకి దిగుదునా ఎప్పుడు పడవలోఁ బడుదునా ఎప్పుడు గట్టెక్కుదునా, ఎప్పుడు మనుమని జూతునా యని యాయనకు నారాట మెక్కువ కాఁజొచ్చెను. ఇఁక గూఁతవ్రేటు దూరమున నున్నది రాజోలు.

తాను గద్దెనెక్కి మొగలితుర్తికోటకు రాజునని ప్రకటించుకొని ప్రకటించుకొనుటతోడనే రుస్తుమ్‌ఖాన్ ప్రతి కోట మీఁదను ప్రతి రేవులోను, ప్రతి దేవాలయముమీఁదను దన బావుటా ఎగురవేయించెను. అన్ని రేవులలోను మహారాజును బంధించుటకుఁ దగిన యేర్పాటులన్నియుఁ జేసివైచెను. ఏ రేవులోనైనను సరే హిందువుఁడైనవాఁడు ప్రతివాఁడు పరీక్షింపఁబడకుండ ముందున కొక యడుగైన సాగిపోవుటకు వీలులేదు. చండశాసనుఁడై ప్రజలను బీడింపఁదొడఁగెను. వాని పేరన్న ప్రజలు గడ గడ వణఁకిపోవుచుండిరి. 'నేను' అని ఎవరైనఁ దలయెత్తినఁ దెగనఱకుఁడని యాజ్ఞాపించెను.

పల్లకి వచ్చి రాజోలు రేవులో నాఁగినది. ఆ దుబ్బుల లోను ఈ దుబ్బులలోను చాటున మాటున డాఁగియున్న ఇస్లామ్ యోధులందఱు నొక్కమ్మడిగా వచ్చి పల్లకి ముట్టడించిరి. మహారాజు పల్లకిఁ దిగెను. అటు నిటు పరికించెను. చెక్కు చెదరలేదు. అతిగంభీరముగా నొక్క వేఁడినిట్టూర్పు విడిచి "సరే యిఁక నాలోచన దేనికి ? కానీయుఁడు. ఏమిచేయఁ దలఁచుకున్నారో!" రాచఱికమునకుఁ దగిన ఠీవితో నాతఁడనిన యామాటలకు నాయోధు లందఱు నొకరి మొగ మొకరు చూచుకొనుచున్నారేకాని యొక్కఁడును రుస్తుమ్‌ఖాన్ ఆజ్ఞను జెప్పుటకు సాహసింపలేదు.

మహారాజు క్షణకాలము చూచెను. అంతయు నవగతము చేసికొనెను. ఎటు చూచినను నొక్కహిందువైనఁ గాన

వచ్చుటలేదు. తుదకు రేవులో నావ నడపువాఁడుగూడ మహామ్మదీయుఁడె.

గంభీర వీక్షణములతో నా యోధుల నుద్దేశించి "ఆలో చించెద రేల" మీ రెవరి యాజ్ఞను బాలింప వేచియున్నారో కానిండు" అనెను. అందొక్కఁడు సాహసించి, 'సర్కార్! తాము మరలఁ బల్లకీలోనికి దయచేయుఁడు' అనెను.

మ:— ఎందులకు ?

యో:—రుస్తుమ్‌ఖాన్‌గారి హుకుం సర్కార్.

మ:— ఏమని ?

యో:— తాము నివసించుటకు నగరములో నన్ని యేర్పాటులు చేసినారు. మమ్ములను దమ్మచ్చటికిఁ దీసికొని వెళ్ళుమని యాజ్ఞాపించినారు.

మ:— మమ్ములనే !

యో:— చిత్తము. అట్లే.

మహారాజు దీర్ఘనిశ్వాసపురస్సరముగాఁ బల్లకియెక్కెను. బోయీలు పల్లకి భుజములపై మోఁపికొనిరి. పల్లకీకూడ విచ్చుకత్తులు తుపాకులుధరించిన భటులు ఆశ్వికులుగూడఁ దరలిపోయిరి.

నాఁటితో సూర్యవంశ తేజస్సు మాటువడిపోలేదను నటులు లోకబాంధవుఁడు పోఁకమ్రాఁకుల సందునుండి కొబ్బరి చెట్లసందునుండి తొంగితొంగి చూచుచు నస్తంగతుఁడయ్యెను.



## ౮

'అభయంబిచ్చి యశంబు గాంతురుగదా యాపన్నసంరక్షకుల్.'

గోదావరీమండలములో భీమఖండమును మించిన పవిత్ర క్షేత్రములేదు. ఈ భీమఖండమునే తొల్లి దక్షప్రజాపతి తన యల్లుఁడైన కొండవిలుకానికి (ఈశ్వరుఁడు) నరణమిచ్చెను.

దక్షప్రజాపతి యజ్ఞముచేసిన పవిత్రారామమే దక్షారామము. అందే దక్షుఁడు యజ్ఞముచేసి పరమేశ్వరునిఁ బరాభవించెను. భర్తకు జరిగిన పరాభవము భరింపలేక పరమేశ్వరియైన సతీదేవి యోగాగ్నిచే నందే యవతారము చాలించినది. అందే వీరభద్రస్వామి యవతరించి దక్షయజ్ఞ ధ్వంసముచేసి యజ్ఞదర్శనమునకు వచ్చిన దేవతల నందఱను జావఁగొట్టి చెవులుమూసెను. ఆ వీరభద్రుని ధాకకాఁగలేకయే బ్రహ్మ నేలపైఁబడ హంస వానిని జెందమ్మివలెఁ గమిచికొని పఱచెను. విష్ణువు గరుడుని మెడనడుమఁ గాలును గేలును నిఱికికొని చెమ్మటలుగాఱ నింద్రధనుస్సువలె మెఱయుచుఁ బరువిడెను. వేఁటకాండ్రచేఁ దఱుమఁబడు నెమిలివలె ఇంద్రుఁడైరావతమునెక్కి పరువిడెను. యముఁడు దున్నపోతుపై నడ్డంబుగాఁ బడి యుప్పుపిఱికివలెఁ బరుగెత్తెను. వరుణుఁడు సముద్రాధిపతియైయ్యును నోరఁ దడి లేక పలాయనము చిత్తగించెను. కుబేరుఁడు తానెక్కెడు నరునిఁ దానే మూఁపున నెక్కించుకొని పాఱిపోయెను.

కాశీక్షేత్రములో నన్నపూర్ణాదేవిచే శపింపఁబడిన వేద

వ్యాసమహర్షి దక్షిణకాశియగు నీదక్షారామమునకు వచ్చియే తన కాశీవియోగబాధను విస్మరించి సంతుష్టిని గాంచెను. అందలి సప్తగోదావరమున స్నానముచేసియే యగస్త్యుఁడు లోపాముద్రతోఁ గూడఁ దన గంగావియోగ క్లేశమును మఱచెను.

పంచారామములలో దక్షారామము సుప్రసిద్ధ పుణ్య క్షేత్రము. ఈ దక్షారామము నెల్లఁగా గొనియే త్రిలింగ (తెలుఁగు) దేశ మేర్పడెను. దక్షారామభీమేశ్వరుని కరుణా కటాక్ష వీక్షణంబులకుఁ బాత్రము కావుటచేతనే తన వంశము నిరంతరాయముగా నభివృద్ధి చెందుచున్నదని శ్రీరంగరాజు మహారాజుగారి యాత్మవిశ్వాసము. అంతర్వేది, రామేశ్వరము లక్షణేశ్వరము, క్షీరారామము (పాలకొల్లు), గునుపూఁడి మున్నగువానితోపాటు దక్షారామములోఁగూడ నేఁటేఁటఁ గళ్యాణమహోత్సవములు మహారాజు సొంత వ్యయముపై జరి పించుచుండెను.

ఈ దక్షారామమునకు ననతిదూరముననే శ్రీరంగ రాజు మహారాజు ప్రేమకుఁ బాత్రుఁడై తనపేరితో హసన్ బాదాయను గ్రామమునిర్మించుకొని యందే తాను గోలకొండ నవాబుల పక్షమున నామమాత్రపు అమీనుగా హసన్‌ఖాను నివసించుచుండెను.

ఇతఁడు తండ్రివలె మేకవన్నెపులిగాఁడు. మొగలితుర్త కోటపై భక్తివిశ్వాసములు మిక్కిలిగలవాఁడు. స్ఫటిక నిర్మల

హృదయుఁడు. అకుటిలుఁడు. ఆర్యధర్మ తత్పరుఁడు. అఖండ త్యాగి. ఆఱు నూఱైన నూఱాఱైనా నబద్ధమాఁడనివాఁడు.

అన్నిటికంటె నతనినిగూర్చి చెప్పుకోఁదగిన ప్రత్యేక విషయమేమన శ్రీ రంగరాజుమహారాజు దేశాభివృద్ధికై చేసిన యేర్పాట్లకు సర్వకాల సర్వావస్థలయందును మెచ్చుకొనుచుండును. మహారాజుచేసిన వర్తకాభివృద్ధిని, సస్యాభివృద్ధిని, ఆర్థికాభివృద్ధిని నతఁడెన్నఁడును విస్మరింపలేదు.

విశేషించి యిట్టి ప్రజాక్షేమంకర ప్రభుత్వము ఎచ్చట లేదనియు, నీ యాదర్శరాజ్యములోని యొక స్వతంత్రపౌరుఁడుగాఁ దా నీగడ్డమీఁదనుండుటయే తనకొక గొప్పవిశేషమనియు ఈపుణ్యభూమిమీఁదనే తాను లీనముగావలయుననియు, నాత్మ గలిసిన మిత్రుఁడగపడినపుడెల్ల నతఁడు చర్వితచర్వణముగాఁ జెప్పుచుండును. అవకాశ మొకవినపు డెప్పుడైన నతఁడు తన కృతజ్ఞతను మహారాజునకుఁ దెలుపుకొనవలయునని యువ్విళ్ళూరుచుండును.

హసన్ ఖాన్ సరళహృదయుఁడగుటచే నతనియొద్దకు సదా నాల్గువర్ణములవారు చేరుచుందురు. తీరికయైనపుడెల్ల నీతఁడు భారతమును జదివించి యందలి రాజనీతి నారయుచుండును. తత్త్వజ్ఞానము నలవఱచుకొనుచుండును. ప్రజాహిత కార్యమున కడ్డుతగులువాఁడు తండ్రియైననరె వానిని జంచి చెండాడవలయునని యాతనితలంపు. శరణాగతరక్షణమున శిబి చక్రవర్తి నెన్ని, వీని నెన్నవలయును.

కోలంక యతని స్వగ్రామమునకు నేడెనిమిది గవ్యూతుల దూరమునఁ గలదు. మహారాజుగారి కోడలు జానకీదేవి గారు పుట్టిన యూరదియే.

అప్పుడప్పుడు బ్రతికియున్న రోజులలో మహారాజుగారి వియ్యంకుఁడు దంతులూరి నారాయణరాజుగారు హసన్ ఖానుని, హసన్ ఖాన్ దంతులూరి నారాయణరాజుగారిని గలిసికొనుట, మంచి చెడ్డ, మాట మంతి, యాడుకొనుట కూడ నుండెడిది.

తఱచుగా విజయనగరమునుండి విశాఖపట్టణము వచ్చి యోడమీఁద నరసాపురములో దిగి మొగలితుఱ్ఱు వెళ్ళెడి యమ్మాజీగారుకూడ దక్షారామమునకు విజయముచేసి శ్రీ భీమేశ్వరస్వామి వారి దర్శనముచేసికొని హసన్ ఖాన్ మీఁదఁగల విశ్వాసముచే వానికిఁ దెరచాటుననుండి పారితోషిక మంపించి సత్కరించెడివారు.

అమ్మాజీగారిచ్చిన పచ్చలపతకమునే యాతఁడు సర్వదా ధరించుచుండును. అతని పర్యవేక్షణమున భీముఖండమంతయు బంగారమయ్యెను.

తండ్రివలె మధుపానము, ధూమపానము చేయఁడు. దేశము స్వయంపోషకముగానుండుటయే వానియాప్తితార్థము. కష్టపడనివాఁడు తినుటకు హక్కులేదని వాని సిద్ధాంతము. ఆ నాఁటికిఁ జాలిన ధనముకన్న నిలువయుంచుకొన్నచో నది పరులసొమ్ము హరించుటయే యని యతని నమ్మకము. ఈవిషయములో ఖురాను ఉపనిషత్తుల సారమొక్కటేయని యతఁడు

గ్రహించెను. వడ్డీవ్యాపారము చేయువారి పేరువిన్న వానికిఁ దలమంట. కష్టజీవులకొఱకే యతఁడు తన జీవితమంతయు వెచ్చించుచుండును. తాను గోలకొండ నవాబుల యుద్యోగిననికాని, వారి జాతివాఁడననికాని యాతఁడెన్నఁడును ననుకొనలేదు, గర్వింపలేదు. జాతిద్వేషమునకు మతద్వేషమునకు నతఁడు విరోధి. సర్వమానవ సౌభ్రాత్రమే వాని నిత్యవాంఛ.

సరిగా మధ్యాహ్నము పదునెనిమిది గడియలవేళ నొక బ్రాహ్మణుఁడువచ్చి హాసన్‌ఖాన్ మందిర ప్రాంగణమున నటునిటు చూచుచు నిలువఁబడెను. వాని కాలియలుకుడు కనిపెట్టి హాసన్‌ఖాన్ లేచి యెదురుగావెళ్ళి దయచేయుఁడని లోనికిఁ దీసికొనివచ్చి కుర్చీపైఁ గూర్చుండఁబెట్టి యతిథి సత్కారము చేసి "తాము వచ్చిన కార్యమేమి" యని సవినయముగాఁ బ్రశ్నించెను. అతఁడు తనది కోలంక యనియు శ్రీరంగరాజు మహారాజుగారి కుమారిక యగు నమ్మాజీగారు పంపింపఁగా వచ్చితిననియుఁ జెప్పెను. స్వయముగా నామెయెడ మాతృభావముగల యాతఁడు ఆదూత చెప్పిన మాటలు విని పులకించిపోయెను. ఆనందముతో 'అమ్మాజీగారు సేమమేకదా! ఈసేవకుని కేమి యాజ్ఞాపించినారు ? సెలవిండు త్వరగా సెలవిండు' అనెను. వెంటనే యా రాయబారి నిలువఁబడి యొక పట్టువుట్టమునఁగట్టిన పట్టుదారముతో నల్లిన రక్షాబంధ కంకణమును బైకిఁదీసి హాసన్‌ఖాన్‌గారూ ! చిత్తగింపుఁడు అమ్మాజీ గారిట్లు సెలవిచ్చినారు. "హాసన్‌ఖానుగారూ! మీసహృదయమే

నన్ను శరణార్థినిగాఁ జేసినది. మాతమ్ముఁడు శ్రీరామరాజు యువరాజయ్యు రాజ్యపాలనమువిూఁద నసహ్యాము గలిగి విరక్తుఁడై తోఁటపల్లికొండలకుఁ దపంబుండ నేఁగిన సంగతి మీకు విశదమే. వానికొఱకై దివాంజీగా రచ్చటికి వెళ్ళిరి. ఎన్నాళ్ళకు రాకపోవుటచే శ్రీ బాబాజీగారుగూడ మాతమ్ముని గురువులగు తిరుమలాచార్యులవారిని వెంటఁబెట్టుకొని తోఁటపల్లి కొండల కరిగిరి. వెళ్ళుచుఁ గోటభారమంతయు మీతండ్రిగారిపైఁ బెట్టిరి. వారంద అక్కడ నుండఁగానే మామఱఁదలు జానకీదేవి పురుడుపోసికొని మగశిశువును గని మరణించినది. ఆమె మరణింపఁగానె మీతండ్రిగారికి నేమి దుర్బుద్ధి పుట్టినదో యాశిశువును జంపి మమ్మవమానపఱచి కోట నాక్రమింపఁగోన నెంచెను. ఆవార్త నేను ముందుగనే గ్రహించి యాశిశువును ఎవరికంటఁ బడకుండఁ దరలించుకొనివచ్చి యిప్పుడు కోలంక గ్రామములో నున్నాను. మేముడుగీవలఁ బెట్టఁగానే మీతండ్రి గారు కోటమీఁది సూర్యధ్వజము దింపించి చంద్రధ్వజము నెత్తించిరఁట. • మా రాజపుత్రిల యాచార పరికారముగా మీ కీరక్షాబంధము పంపించుకొన్నాను. మీరిది ధరించి రాజపుత్రి స్త్రీయైన కర్ణావతిని హుమయూన్ గాపాడినట్లు మమ్ముఁ గాపాడి మొగలితుర్తి కోటలో నీ శిశువును బట్టాభిషిక్తునిఁ జేయుదురుగాక! యని యాశించుచున్నాను" అని యా రక్షాబంధమును హసన్‌ఖానున కొసంగెను.

హసన్‌ఖాన్ మందస్మిత సుందర వదనారవిందుఁడై యా

కంకణము నందుకొని కన్నులకద్దుకొని యా బ్రాహ్మణునితోఁ "పండితజీ !' త్రిలోకంబు లేకమై వచ్చినను, సూర్యచంద్రులు గతులుతప్పినను, సప్తసముద్రము లేకమై పొంగినను, మేరువు తలక్రిందైనను, నేను బాలరాజును మొగలితుర్తికోటలో సింహాసనాధిష్ఠితునిఁజేయుదును. ఈసంగతి యమ్మాజీగారితో మనవి చేయుఁడు. ఆమెను నిశ్చింతగా నుండుమనుఁడు" అని చెప్పెను.

బ్రాహ్మణుఁడు హసన్ముఖుఁడై కృతజ్ఞతను వెల్లడించి సెలవుతీసికొని వెడలిపోయెను. అతఁడట్లు వెడలఁగానే హసన్ ఖాన్ సరసర లోపలి కేఁగెను.

అతి ప్రశాంతమూర్తియగు నాతఁడు రక్షాబంధము ధరించిన గడియనుండి ప్రళయకాల రుద్రునివలెఁ జూపట్టుచుండెను. ప్రశాంతములగు వానిచూపులు అగ్నికణములు గ్రక్కుచుండెను. పరమయోగి హృదయమును బోలిన వాని హృదయము రోషపూరిత మయ్యెను.

---

౮

"అంతర్వేది నృసింహమూర్తికి బుధాహ్లాదంబుగా నుత్సవం
బెంతేవేడుకఁ గేతకీపుర మహాపృథ్వీపతుల్ నవ్య ది
క్ర్పాంతస్థుల్ వెరఁగందఁ జేయుదురు మాఘైకాదశిన్ తద్రథం
బంతన్ సాగుఁ దదీయ రజ్జుల పయిన్ హస్తంబు తారుంచఁగన్"

ఆంధ్రదేశంబునఁగల శ్రీశైల సింహాచల దక్షారామ క్షీరారామాది పుణ్యక్షేత్రంబులకెల్ల మిన్నయై యంతర్వేది

పుణ్యక్షేత్రంబు నానాదేశాధీశులను, త్రైర్థికులను, సర్వదా తని యించుచుండును.

ప్రతిసంవత్సరము భీష్మైకాదశినాఁడు భక్తులు బహు జన్మపరంపరా కలుషనివారితంబగు వాసిష్ఠీ సింధుసంగమంబునఁ గృతస్నాతులై యంతరంగంబులం దుత్తుంగ తరంగితంబులగు హర్షంబు లుప్పొంగ ధగద్ధగాయమాన భవ్యరత్న ఘటితా శేషభావుండును, దయాద్యలంకృత దివ్యమంగళ విగ్రహుండును నగు (శ్రీ) లక్ష్మీ నృసింహస్వామిని గనులపండువుగ నీక్షించి, సాష్టాంగ దండప్రణామము లాచరించి పరమానందంబున నద్దేవదేవు దివ్య తీర్థప్రసాదంబులు గైకొని కృతార్థులై తమ జన్మంబులు సఫలంబులైనవిగా తలంచి, తమతమ నివాసంబు లకుఁ జనుచుందురు. కాశ్మీరదేశంబు సౌభాగ్యంబును గన్నుల కుఁ గట్టుచుఁ గోనసీమ గోదావరి మండలమున విరాజిల్లు చుండును. కోనసీమ యన్నది నేటి అమలాపురము, రాజోలు తాలూకాలు రెండును, రాజమండ్రి (రాజమండ్రి) సమీపములోనున్న బొబ్బరలంక, గుత్తెనదీవి, యంతర్వేది గ్రామములనడుమ రెండువందల పంద్రెండుక్రోసుల విస్తీర్ణము గలిగి రెండువందల యిరువదియైదు గ్రామములు గలిగి నాల్గు లక్షల జనులచేఁ గలకల లాడుచుండును. అఖండ గోదావరి కంతర్భాగమునైన గౌతమీ వసిష్ఠానదుల మధ్యప్రదేశమే యీ కోనసీమ. ఇందే గోదావరి యేడుపాయలుగాఁ ప్రవ హించినది. అందు ప్రధానమైన నదీశాఖలు కౌశిక, వృద్ధ

గౌతమి, వైనతేయులు.

శ్రీరంగరాజుగారి పరిపాలనంబుననే యీసీమ నందనోద్యానమైనది. అందెచ్చటఁ జూచినను పోఁకమ్రాఁకులె. ఎచ్చటఁ గాంచినను గొబ్బరితోఁటలె. ఎచ్చట వీక్షించినను బనస రసాల కర్పూర కదళీకారామంబులె.

ఆ కోనసీమ కోనయందే యంతర్వేది పుణ్యక్షేత్రంబు గలదు. ఆ క్షేత్రరాజమున కధిదేవత శ్రీ నృసింహస్వామి. స్వామివారి కగ్రభాగంబుననే రత్నాకరుండు సదా వసించుచుఁ దన యల్లుని కెల్లవేళల నూర్మిహస్తములతో రత్నంబులర్పించుచుండును. స్వామి పాదోద్భవయగు గౌతమీగంగ (వసిష్ఠానది) యాచెంగటనుండియే ప్రవహించుచుఁ దనతండ్రి కన్నుల యెదుటనే రత్నాకరుని గవిసి మురియుచుండును. అదికాంచి నృసింహస్వామి మామకు మామయైతినని సంతసించుచుండును. అంతర్వేది క్షేత్రమున కెటుచూచినను నాలుగైదు గవ్యూతుల దూరమువఱకు సైకతస్థలులె. యాత్రికుల కిచ్చట నెన్నఁడు అఱకాలు బాడిగాదు. ఒక్కయాత్రికుఁడును గందఁడు గాజువాఱఁడు.

అది నాత్యుష్ణము నాతిశీతలమునైన మాఘమాసము. తెల్లవాఱిన శుక్లపక్షైకాదశి.

అది దశమినాఁటి రాత్రి. అప్పుడే రెండుజాములైనది. వచ్చెడి బండ్లు వచ్చుచున్నవి. పోయెడి బండ్లు పోవుచున్నవి. వచ్చెడి పడవలు వచ్చుచున్నవి. పోయెడి పడవలు పోవుచు

న్నవి. వచ్చెడి తోడలు వచ్చుచున్నవి. పోయెడి తోడలు పోవుచున్నవి.

ఆపండువెన్నెలలో అబ్బా! ఎక్కడఁజూచినను జన తండములె. ఇంకొక రెండుగడియలలో శ్రీ నృసింహస్వామి వారి కళ్యాణమహోత్సవము ప్రవర్తిల్లును. సాధారణముగాఁ గళ్యాణ సమయమునకే మహారాజు శ్రీరంగరాజులుంగారు వచ్చుట యాచారము. ఒకవేళ నేదేని రాచకార్యమున్న రథోత్సవమునకునైన మహారాజువచ్చితీరవలసినదే. రథముపై శ్రీస్వామివారధివసింపఁగానె కూష్మాండములు పగులఁగొట్టుట తడవుగా రథముత్రాటిపై శ్రీమహారాజు చేయివైచినఁగాని యది వందమంది వేయిమంది లక్షమంది కోటిమంది పట్టి లాగినను గదలదు.

ఆతీర్థమునకు వచ్చు యాత్రికులలో నూటికిఁ దొంబది మంది దేవతా దర్శనమునకంటె మహారాజు దర్శనమునకే వచ్చుచుందురు. వచ్చి తనివుదీఱ నా దివ్యసుందర మంగళ మూర్తిని సందర్శించి మరల సంవత్సరముదాఁక నా మహారాజునుగూర్చియే యాలుబిడ్డలతో ముచ్చటించుకొనుచుందురు.

దేవాలయములో నఖండదీపము గూడ వెలిఁగించిరి. దివ్వటీలు కోటానగోట్లు వెలుఁగుచుండెను. ఆకాశదీపములు రాకాసుధాకరునితో నెకసక్కెములాడుచుండెను. ప్రజానీకము రక్షకభటుల యవసరము లేకయే తొక్కిఁపులాడకుండ వచ్చి చేరుచుండెను.

మహారా జప్పటికే వచ్చియుండునని ప్రజలు పరుగు పరుగున వచ్చిపడుచుండిరి. కాని జయఘంట లింకను మ్రోఁగ కుండుటను జూచి "రాజుగారింకను రాలేదు. అమ్మయ్యా! బ్రతికినాము. ఈవేళ మహారాజును హాయిగా దర్శింపవచ్చును" అని యనుకొనుచుండిరి.

అర్చకుఁడు చూచిచూచి మహారాజులు కళ్యాణవేళకు రారని నిశ్చయించుకొని జయఘంటికా ధ్వానముచేసి కళ్యాణ మహోత్సవమున కారంభించెను. ప్రజలు త్రోఁపులాడుచు గుడిలోనికి విఱుగఁబడఁజొచ్చిరి. ఇంతలోనే కొందఱు "మహా రాజుగారు రాలేదురా. కళ్యాణ మేమిచూచెదము. హాయిగా నిద్రపోయి ప్రొద్దుటనే సాగరసంగమములోస్నానముచేసి స్వామి దర్శనము చేసికొని వండిచ్చి మధ్యాహ్నము రథోత్సవమునకు వత్తము. అప్పటికిఁ దప్పకుండ మహారాజు వచ్చితీరును" అని యనుకొన నారంభించిరి. గోడలకుఁ జెట్లకు నెగఁబ్రాఁకువారు దిగివచ్చి కొందఱు తోలుబొమ్మలాట చూచుటకుఁ గొందఱు వీథినాటకములు చూచుటకుఁ, గొందఱు భామవేషముచూచు టకుఁ, గొందఱు గొల్లవేషము చూచుటకు, గొందఱు వినోద ప్రసంగములు గావించుకొనుటకు కొందఱుఁ దలకొక దారికిఁ బోయిరి. కల్యాణ మేదోమాదిరిగా జరిగిపోయినది.

అప్పుడే కొందఱు ముందుగా స్నానము చేసివచ్చి స్వామిదర్శనము చేసికొందమని సముద్రస్నానమునకు సాగిరి.

కొంద'అమ్మయ్యా! బ్రతికినాముర బాబూ! రాత్రి

రాకపోయినఁ బోతిమిగాని ఇప్పుడు వచ్చినను, లోటులేదు. మహారాజుగా రింకను రాలేదఁట. రథోత్సవము వేళ కేలాగున నైన వచ్చితీరెదరు' అనుకొనుచు, బారులుతీరి చీమలపంక్తుల వలె సముద్రస్నానము చేసి రాఁ దొడఁగిరి. ఇటు నరసాపురము అటు రాజోలు మొదలుకొని, యొక్కటేబారుగా నొక్కటే దండుగాఁ దైర్థికులు రాఁ దొడంగిరి.

రామభజనలు చేయువారు చేయుచున్నారు. ఆఁబోతుల నూరేఁగించువా రూరేగించుచున్నారు. మతబోధ చేయువారు చేయుచున్నారు. ఉపన్యాసము లిచ్చువా రిచ్చుచున్నారు. సత్రములలోఁ జావడులలో సంతర్పణములు మహావైభవముగా సాఁగిపోవుచున్నవి. తినువారు తినుచున్నారు. వండుకొనువారు వండుకొనుచున్నారు. కొందఱు చేటలు, కొందఱు పీఁటలు, కొందఱు బుట్టలు, కొందఱు తట్టలు, కొందఱు కాయలు, కొందఱు ఖర్జూరములు, కొందఱు జీళ్ళు, కొందఱు పానకములు, కొందఱు లక్కబొమ్మలు, కొందఱు రాతిచిప్పలు, కొందఱిత్తడిపాత్రలు, కొందఱు సన్నబియ్యము, కొందఱు జీడిపప్పు 'కొనుక్కొని' తినుచు నానందముతోఁ దిరుగుచున్నారు.

అంతలో నక్కడక్కడ "మహారాజు రంగరాజుగారు రారఁట. లేకపోయినచో రథోత్సవము వేళ దాఁటిపోయెడు సమయమైనది. ఇంకను దేవుఁడు రథముపైకి రాలేదేల" అని ప్రజలనుకొనుచుండఁగానే మంగళవాద్యములతో స్వామిని దీసికొనివచ్చి యర్చకుఁడు రథారూఢునిఁ జేసెను.

“మహారాజు రాలేదు. ఇఁక నాలస్యముచేయకుఁడు వర్జసమయము సమీపించుచున్నది. రథము సాఁగనీయుఁడు. మహారాజునకై వేచియుండకుఁడు” అని పెద్దలనిరి. ప్రజలందఱు నొక్కుమ్మడి రథమును లాగఁజొచ్చిరి. అంగుళమైనను ముందునకుఁ గదలలేదు.

అంతలో అర్చకుని తండ్రియగు అప్పలాచార్యులుగారు వయస్సుచే శరీరమువణఁకుచుండఁగాఁ గుమారునిచేయి యూఁతగాఁగొని రథముపై నిలువఁబడి యుచ్చైస్స్వరముతోఁ బ్రజలనుద్దేశించి యిట్లనెను.

‘మహాజనులారా! మహాభక్తులారా! వినుఁడు వినుఁడు ఎంత ఘోరమువో వినుఁడు. నేను రాత్రి కళ్యాణానంతరమున నించుక గన్నోడ్చితిని వెంటనే

“కరుణామరందంబు గురియు కర్ణాంత దీ
ర్ఘములైన లోచనాబ్జములతోడ
పొక్కిలి తమ్మి పుప్పొడి చాయఁదులకించు
జిలుఁగైన జాళువా వలువతోడ
లలితలీలఁ గపోలముల కెలంకులముద్దుఁ
జిలుకు లేనవ్వు వెన్నెలలతోడ
అంబుజ బాంధవ బింబ డంబంబు వి
డంబించు మణి కిరీటంబుతోడ
నిండు వేడుకతోడఁ గైదండ యొసఁగు
పాలమున్నీటి గారాబుపట్టితోడ

సిరులు దైవార లక్ష్మీనృసింహ శౌరి
స్వప్నమునయందు నాకు సాక్షాత్కరించి."

'ఓరీ! ఏనుఁగు లీఁదఁదగిన యనేక తటాకంబులు కాలు వలుత్రవ్వించి పనస రసాల రంభా నారికేళాది బహు వనస్థాపనములుచేసి బ్రాహ్మణుల కనేకాగ్రహారములిచ్చి లక్ష్మణేశ్వర, రామేశ్వర, కేతకీపురంబుల, దేవాలయప్రతిష్ఠలుచేసి, దేశంబు నుద్ధరించిన శ్రీ రంగరాజు పోతుటీఁగకైనఁ జొరరాని యొక యింటిలో నగరములో బంధింపఁబడి యున్నాఁడు. పోయి విడిపించుకొని రండు. నాభక్తుని బాధలను బోకార్పుఁడు" అని చెప్పెను. లేచిచూతునుగదా స్వామివారు కానరాలేదు. అనెను.

అది వినఁగానే హాహాకారములు చెలరేఁగిపోయెను. భువనభోంతరాళములు భోరుకలంగెను.

ఆ జనసమూహమునుండి యొక మహాపురుషుఁడు తటాలున రథముపైకుఱికి "ఓమహాజనులారా! ఎవ్వరును వెడలి పోకుఁడు ఎంతరాత్రియైననసరే మనము నగరమునకువెళ్ళి మహారాజును, జెఱవిడిపించి తీసికొనివచ్చి మన కృతజ్ఞతను వెలిపుచ్చుకొందము" అని సింహగర్జనముచేసెను. ఆగర్జనముతో ఆబాలగోపాలము చేతి కేదిదొఱకిన నదే యాయుధముగా గ్రహించి నగరాభిముఖులై పఱచిరి.

ఉద్రేకపూరితమైన ప్రజాశక్తిని నెవఁ డణఁచఁగలఁడు. ఏకథాటిని వారెల్లఁ బ్రమటిలో నగరమునకేఁగి యగపడినచెట్టు·

పుట్ట విఱిచి విత తాడనంబుగాఁ బాఱవైచి యిల్లిల్లు గాలించి మహారాజును జెఱవిడిపించి భుజములపై నెక్కించుకొని జై రంగ రాజు మహారాజునకు జై యని జే జే నినాదములు చేసిరి.

మహారాజు 'ప్రజలారా! మీశక్తికిమెచ్చితిని. నన్నేల నిర్బంధముగాఁ దీసికొనిపోవుదురు? కొడుకా యారీతిని నడవుల పాలయ్యెను. కోడలా యట్లు గతించినది. శిశువాయేమయ్యెనో తెలియదు. ఇఁక నే నేయాశ పెట్టుకొని యంతర్వేదికి వత్తును. స్వామిని దర్శింతును? అయినదేదో యైనది. నన్నిచ్చటనే యీచీఁకటికొట్టులోనే మసికానిండు" అనెను.

ఆమాటలు వినఁగానే ప్రజలకు దుఃఖ మొక్కుమ్మడిగాఁ బొంగిపోయినది. హాహాకారములు చేసిరి.

'కాదు మహాప్రభూ! మీరు దయచేయవలెను" తప్ప దని యఱచిరి. మరల జై! రంగరాజు మహారాజునకు జై! యని జయజయధ్వానములు బయలు దేఱెను. క్షణములో భుజాలపైఁ బెట్టుకొని వచ్చి మహారాజును నంతర్వేదిలో రథారూఢుఁడైన స్వామి చరణసన్నిధిని దింపిరి.

"అప్పటికే జాము రాత్రిపైఁగానయ్యెను. ఇఁక నాల స్యము కూడదు. వర్షము వచ్చుచున్నది. ప్రభువువారిని రథము త్రాటిని బట్టుకొనుమనుఁడు" అని యర్చకుఁడు కోరెను. మహారాజు త్రాటిపైఁదన కరపల్లవమునుఁ మోపి గోవిందా! యనెను. ప్రజలందఱు గోవిందా! గోవిందా!యని త్రాడుసారించి లాగిరి. క్షణములో రథము శరవేగముతోఁ బరుగిడెను.

పై నుండి యర్చకుఁడు "అయ్యో యయ్యో! మహా ఘోరము. ఆఁగుఁడాగుఁడని" యఱచెను. రథము ముందునకుఁ బోయి యాఁగినది. దుమ్ము పెల్లురేఁగి దివ్విటీలకాంతిని, జంద్ర కాంతినిగూడ మాటివైచి నిరోధించెను. ప్రజలందఱు వెనుకకుఁ దిరిగి యొకరి నొకరు త్రొక్కుకొని, విఱగఁబడిచూచిరి.

తీర్థాకాశమంతయు నీరంధ్ర నిబిడాంధకారము క్రమ్మివైచెను. ఇంకేమున్నది. మహారాజు రథముక్రిందఁబడి నలిగి పోయెను.

---

౬

"అన్నమో రామచంద్రా! యటం చడలి యడలి
గుడ్డిగవ్వకుఁ గొఱగాక గడ్డిగఱచి
ప్రజలు శరణంబు నొందిరి ప్రజలువోలెఁ
గావు మంచును జని హసన్‌ఖాను నపుడు."

ఊహ యెఱిఁగినది మొదలు, కాసె కట్టి కోకచుట్టి కత్తి పట్టి శత్రుసంహార మొనర్చి, దేశము నిష్కంటకముచేసి యనంత సామ్రాజ్యము నార్జించి, యేమతస్థుఁడైననరే తన మతవిశ్వాసమున కనుగుణముగఁ దన రాజ్యమున స్వేచ్ఛగా బ్రతుకునట్లు పాలించి, నేల నాలుగు చెఱఁగులు బంగారుమయముచేసి ప్రజల పాలిట కల్పవృక్షమై కవి గాయక పండిత శిల్పకారులకు గామధేనువై యరిభయంకరుఁడై ఆతతాయి జన శమనుఁడై, యీతి బాధా నివారకుఁడై, హరిపూజా ధురంధరుఁడై, యేకపత్నీ

ప్రతుఁడై యసహాయశూరుఁడై, యఖండత్యాగియై, సప్తసంతాన కలితుఁడై, కుంద మందార చందన హార నీహార హీర వారి జాత సదృశ యశోవిరాజియై విలసిల్లిన శ్రీ రంగరాజు మృతకళే బరము వాసిష్ఠీసాగర సంగమంబునఁ జందన తరుకాష్ఠముపై భగభగ మండ నారంభించెను.

శ్రీ నృసింహస్వామివారి కళ్యాణమహోత్సవమునకు వచ్చిన యశేషజనానీకము ఇసుక వేసిన రాలకుండ నాకాష్ఠము చుట్టు మండలాకారముగా రెండుగవ్యూతుల విశాల భూభాగము నావరించి కూర్చుండి యుండిరి. ఎవరికి వారే యిఁకఁ గర్తవ్యమేమిటి? యిన్నాళ్ళుదాఁక సుక్షత్రియులైన శ్రీ మొగలితుర్తి రాజుల ముత్యాల వెల్ల గొడుగునీడను మనము నిలిచినాము. కడుపులోని నీళ్ళు కదలకుండ నిమ్మకు నీరుపోసి నట్లుగా జీవించినాము, దేశ మత్యంతౌన్నత్యము పొందినది. కళలు వర్థిల్లినవి. శాస్త్రవిద్యలు పెంపొందినవి. వేదకర్మాభిరతి హెచ్చినది. కులములు తెలివిగాంచినవి. ప్రజలు తెలుగు మీఁటినారు. వర్తకము వర్థిల్లినది. తెలుఁగు ఓడలు నానా దేశములకు పరుగులు వాఱినవి. భోగభాగ్యములు వెల్లివిరిసినవి. సత్య దయా ధర్మ శౌచములు నెలకొనినవి. ఆంధ్రుఁడన్న పర దేశములలోఁ 'బరపతి' పుట్టినది. ఇఁక నేమిగానున్నదో! రుస్తుమ్‌ఖాన్ కేవలము స్వమతాభిమాని. పరమతద్వేషి. ప్రజలను జలగ పీల్చినట్లు పీల్చివేయును. ఇఁక నేమి చేయుదము. ఎందుఁజొత్తము అని కుత కుత యుడికి పోయిరి.

అంతలో అగ్ని భట్టారకుఁడు రంగరాజను తనలో లీనము చేసికొని పవిత్రుఁడై పావకుఁడను బిరుదమును వహించెను. మహదాశ్రయము లభించిన వారెన్నఁడు వ్యర్థులుగారుగదా!

వెంటనే ప్రజానీకము లేచి యాసాగర సంగమంబునఁ గ్రుంకి మహారాజునకు నివాపాంజలు లొసంగి చితాభస్మము నొసల ధరించి నిలిచిరి. ఒక్కరును ఒక్క యడుగైన ముందున కిడరైరి. వారిలో ధీరుఁడైన ఆలమూరు రామయ్యపంతులను ధీశాలి చేయెత్తి యెలుఁగెత్తి యిట్లు వాకొనెను.

"మహాజనులారా! మనము ఇన్నినాళ్ళు ఏమహారాజు నిరంతర కృషిచే ఇంత కూడు తినుచున్నామో యే మహా మహానిదీక్షచే ఇంత నాగరికతను గాంచినామో యామహా రాజు మనల విడనాడి చనినాఁడు. వాని పాటుచే మనజాతి చచ్చుటా జీవించుటా యను నదియే నేఁటిప్రశ్న. మహారాజు నిమిత్తమాత్రుఁడై మనలఁ బాలించెనేకాని తానేమియు నెత్తిఁ బెట్టుకొని పోలేదు. మన మందరము ఇందనుక స్వతంత్ర పౌరులమై జీవించినాము. నేఁటితో మన స్వాతంత్ర్యము అడుగంటి నది. ఇఁక మనము బానిసలము. బానిసజాతి స్వేచ్ఛకు నెంత దవ్వు? స్వేచ్ఛారహితమైన బ్రతుకు బ్రతుకుటకంటె మడియుట యుత్తమంబు. నేఁటితో మన ధర్మపరిపోషణమునకు స్వస్తిచెప్పుటయా? మన సంస్కృతికి నీళ్ళు వదలుకొనుటయా. ఈరెండును వదలుకొనునాఁడు మనజాతి యున్నను నశించినను నొక్కటే.

మన ధర్మము మన సంస్కృతి మన కళలు అన్న భిన్నా

భిప్రాయము లేనివాఁడు, దేశహితైషి, సర్వజన సర్వమత సమాదరణ పాత్రుఁడు, శాంతమూర్తి, సత్త్వగుణ విరాజితుఁడు నైన హసన్ ఖాను నాశ్రయించుటే మనకుఁ బ్రస్తుతము కర్తవ్యము. మన మందఱము ఇక్కడనుండి హుటాహుటి నక్కడకుఁ బోయి యేకగ్రీవముగ నాతని మనరాజవంశము కీర్తిని నిలిపి మనలను బాలింపు మని ప్రార్థింతము. కుశాగ్రబుద్ధియు మానవసేవాపరాయణుఁడు నైన యాతఁడు మనప్రార్థనము నెన్నఁడును వృథచేయఁడు సరికదా మనల నందఱ నాదరించి పాలించును. ఈ క్లిష్టపరిస్థితిలో వాని యాశ్రయము నొందఁజాలమేని మనము గ్రుడ్డిగవ్వకుఁ గొఱగాకుండఁ బోదుము. రుస్తుమ్ ఖాన్ ఎంత కుక్షింభరియో హసన్ ఖా నంత యుదార స్వభావుఁడు. అతఁడు ప్రపంచమంతయుఁ దన కుటుంబమని భావించు విశాలహృదయుఁడు. ప్రజాసేవకై తన ప్రాణముల నైన నర్పించుట కతఁడు వెనుదీయఁడు. పైఁగా సర్వమత సమభావుఁడు. నిరంతర సుకార్యదీక్షాపరుఁడు. ఆడి తప్పనివాఁడు. పలికి బొంకనివాఁడు. రంగరాజుగారు చేసిన 'సుపరిపాలనంబునకు మురిసి మురిసి తన్మయుఁ డగుచుండును. ఇట్టి ప్రజాహిత పరిపాలనము ఎచ్చటను ఎప్పుడు జరగలేదని మెచ్చుకొనును. దేశ మిట్లు సుభిక్షముగా నేలఁగలిగిన రాజు ఏ చరిత్రలోను లేఁడని యానంద పరవశుఁడగుచుండును. మాయూరుగు అల మూరు ఆయనయున్న హసన్ బాదాకు సమీపంబున నుండుట చేతను విశేషించి యాయన రాజకీయవేత్త యగుటచేతను నన్ను

ప్పుడప్పుడు తానున్న చోటునకు రావించి గౌరవించి సమ్మానించి మాతాతగారు వ్రాసిన రాజనీతిసారమును నాచేఁ జదివించి యానందించి రంగరాజుగారి పరిపాలనమునకు నీ రాజనీతిసారము గీటురాయిగా నున్నదని మెచ్చుకొనుచుండును. కావున మీ రందఱు నాతో రండు. నాల్గుదినములపాటు పని పాటులు కట్టిపెట్టుఁడు. తిన్నఁగా నిక్కడనుండియే హసన్ బాదాకు పోదము. పోయి యాయన నాశ్రయింతము"

అనఁగానే యా జనతండమంతయు సెబాసని మెచ్చుకొని దుఃఖభారంబులఁ గొండొక తొలఁగఁద్రోచికొని కతిపయ ప్రయాణంబుల సంబాజీపేట యాలమూరులు మీఁదుగా హసన్ బాదాకుఁ జనిరి. వీరును హసన్ బాదా చనునప్పటికి దైవయోగంబునఁ జేసి హసన్ ఖాన్ హసన్ముఖుఁడై మొగసాలలోఁ గూర్చుండి భారతములోని శాంతిపర్వము చదువుకొనుచుండెను.

అతని దర్శనమునకు ఆటంకములులేవు. ఎప్పుడు వెళ్ళి యెవరు చూచినను బాధలేదు. అర్ధరాత్రమందయిన నతనిని దర్శింపవచ్చును. గాఢనిద్రలోనున్నను లేపవచ్చును. కష్టసుఖములు చెప్పుకొనవచ్చును. అతనియొద్ద భేషజము లేదు. సౌమ్యుఁడు, సుదర్శనుఁడు. దుఃఖతప్తులైన ప్రాణుల యార్తినిఁ బోకార్చుటకే యాతఁడు బద్ధకంకణుఁడైయున్నాఁడు. నిరాడంబరుఁడై నిష్కల్మషుఁడై యున్న యాతని దర్శించుటకు వెఱవ నక్కఱలేదు. కావున రామయ్యపంతులు తన వెనువెంట

నున్న జనానీకమును గూడఁ దీసికొనియే వాని సమ్ముఖమునకుఁ జని సలా మొనర్చి నిలిచెను.

అంతవఱకు భారత పతనమున నిమగ్నుఁడై బాహ్య ప్రపంచమును మఱచియున్న హసన్ ఖాన్ 'సలాము' అన్న రామయ్యపంతులు కంఠస్వరము నాలించి యులిక్కిపడి లేచి కొన్ని క్రోసుల దూరముదాఁక నున్న ప్రజాసముదాయమును జూచి యాశ్చర్యచకితుఁడై "ఏమిటి పంతులుగారూ! యీ ప్రజా ప్రవాహము! ఎక్కడనుండి మీరాక? ఏమిటి విశేషములు? సెల విండు. దయ జేయుఁడు, కూర్చుండుఁడు. వారి నందఱిని గూర్చుండు మనుఁడు".

అనఁగానే రామయ్యపంతులు చేయి వీచి వారి నందఱను గూర్చుండుఁ డనెను. వారందఱుఁ గూర్చుండఁగానే యెక్కడ నుండివచ్చిరో మనుజుని కొక్కరుఁడు చొప్పున సేవకులు వచ్చి కరివేపాకు సొంటి దబ్బాకు పచ్చిమిరెపకాయ ముక్కలు ఉప్పు కలిపి తేటగాఁజేసిన మజ్జిగ తీసికొనివచ్చి "మార్గాయాసమున అలసి సొలసి యున్నారు. ఈ చల్లనీళ్ళు ద్రావి దాహోపశాంతి గావించుకొనుఁడు. మోమోట పడకుఁడు. వంటలగుచున్నవి. భోజనముచేసి మఱి దయచేయుఁడు" అని యాదరపూర్వకముగ నొక్కొక్కనికి నీయఁ దొడఁగిరి.

హసన్ ఖానునుగూర్చి తాము విన్నదానికి ఇప్పుడు కన్న దానికి సరిపోవుటచే వారు వికసిత హృదయారవిందులై తృప్తి దీఱ దాహంబులు ద్రావి రామయ్యపంతులువైపు నకుఁ జూచిరి.

పరేంగితజ్ఞుఁ డగునాతఁ డది గ్రహించి లేచి నిలువఁబడఁగానే హాసన్ ఖాన్ వలదు కూర్చుండినని చెప్పెఁడు. అందఱము మాన వులమే. అధికారమునుబట్టి హెచ్చులొచ్చులు కల్పించుకొనుట యజ్ఞానము. భగవంతుని దృష్టిలో సర్వులు నొక్కటే. ఈ సేవ కుఁడు చేయఁదగినదేదియో సెలవిండు తప్పక చేయఁగలఁడు.

రా:— హాసన్ ఖాన్ గారూ! మీకును దెలిసియేయుం డును మీతండ్రిగారు కావించిన రాజద్రోహము. 'లక్ష ధను ర్ధరులు తనకుఁ బెట్టనికోటలై వెంట నంటగాఁ బర బలమును వంచబంగాళముచేసి యింతసామ్రాజ్యమును ఆర్జించి యాంధ్రా వని కొక క్రొత్త తేజమును, క్రొత్తరూపమును నిచ్చి యాంధ్రు లను గుండెలుతీసిన బంట్లుగ భయ మెఱుంగని వీరులుగఁ దీర్చి దిద్ది తన పరిపాలనములోనున్న యీ యఖండ భూభాగము నెల్ల ముక్కారుం బండు రత్నఖండముగాఁజేసి మొగలితుర్తి కోటకొత్తళముపైని సూర్యపతాకము నెగురవేసి ప్రజా రంజకుఁడైన శ్రీ రంగరాజుగారు నిండుచూలాలైన కోడలిని కోటలో విడిచి తపంబునకేఁగిన కుమారుని నెమకుటకై యర ణ్యాలకు వెళ్ళుచు నమ్మిన స్నేహితుఁడుగదా యని మీతండ్రి గారికి సర్వస్వము నప్పగించెను. ఇంతలో జానకీదేవిగారు ప్రస వించి స్వర్గస్థులైనారు. ఆమె చనిపోవుట తడవుగా మీతండ్రి గారు ఆశిశువునుగూడఁ బుణ్యముగట్టుకొని కోట నాక్రమించు కొన్నారఁట. పైఁగా మహారాజు రంగరాజుగారిని నగరములో నిర్బంధించినారు. అంతర్వేది తీర్థమునాఁడు మహారాజుగారు

లేకపోవుటచే రథము కదల దయ్యెను. అర్చకునకు స్వామివారు స్వప్నమున సాక్షాత్కరించి నగర వృత్తాంతంబును దెలిపెను. ప్రజలు రోషావేశులై చని మహారాజును జెఱ విడిపించి, తీసికొని వచ్చిరి. మహారాజు రథము త్రాటిపై చేయి మోపఁగానే రథము పరుగువాఱెను. రాజు దానిక్రిందఁ బడెను. మొగలితుర్తి రాజవంశ మంతరించెను. మఱేమున్నది. హసన్ ఖాన్ గారూ! ఇంత ప్రజాహితకారియైన ప్రభువునకు ద్రోహముచేసిన మీ తండ్రిగారిని మీరు త్రోసిరాజుచేసి, యెట్టైన మొగలితుర్తి రాజవంశము కీర్తిని నిలువఁబెట్టి మీ యుదారత ప్రకటింపుఁడు. ఇదే యీప్రజానీకముకోరిక. ఈ సామ్రాజ్యమునంగల యశేష జనంబులు మీయడుగుజాడలలో నడువఁగలరు. ఇఁకఁ బాలను ముంచినను నీళ్ళనముంచినను మీదే భారము'.

అనఁగానే ప్రజలందఱు లేచి నిలిచి 'అదే మా వాంఛ! అదే మాకోర్కె, అదే మాపూనిక, అదే మాయాశయము, ప్రార్థన' అని యేకగ్రీవముగాఁ బలికిరి. ఆమాటలు విని సర్వ కాలసర్వావస్థలయందు హసన్ముఖుఁడై యుండు హసన్ ఖాన్ నవ్వి "ప్రజలారా! మీ యభిప్రాయాను సారముగాఁ నడచుకొనఁ గలను. ప్రజాభిప్రాయము పాటింపక పరిపాలించు ప్రభుత్వ మెట్టిదైనను దానిని నేను సహింపను. ప్రజాభిమతంబులుగాని చట్టములు వేనిని నేను మన్నింపను. నాశక్తిసామర్థ్యములెల్ల నట్టిచట్టముల మట్టుపెట్టుటకే వినియోగింతును. సర్వ మతసహనము లేనివాఁడు ఏజాతివాఁడుకానీ యేమతమువాఁడు

కానీ వానిని నేను సహింపను. సర్వమతములు సమానమని బోధించి భిన్నమతములవారికి మైత్రిచేకూర్చి మొగలితుర్తి సామ్రాజ్యమునకుఁ దాను ధర్మకర్తగా మాత్రమే యుండి ప్రజాప్రభుత్వముగాఁ బాలించిన రంగరాజు మహారాజుగారు దారుణమరణము నొందుట ప్రజల దురదృష్టముగా నేను మీతో పాటు విచారించుచున్నాను. జాత్యహంకారమున కెడములే కుండ సృజింపఁబడిన యీరాజ్యమున జాత్యహంకారమున కెడ మిచ్చుప్రభుత్వమును సాఁగనిచ్చుట నాకును మీకును గూడఁ దలవంపులు. నామాటలను విశ్వసింపుఁడు. తప్పక నేను మా తండ్రిగారికి రాయబారమంపి కార్యము చక్కఁజేతును. రాయ బారములచేఁ గార్యము చక్కఁబడనినాఁడు దండనీతినే వహింతును. మీరు నిశ్చింతగా నుండుఁడు. ఇదే మీయందఱ సమ క్షమున కత్తిపట్టుకొని ప్రతిజ్ఞచేయుచున్నాను. మొగలితుర్తి కోటపై సూర్యధ్వజము ఒకసంవత్సరములో మరల నెగురవేయు దును". అనఁగానే వారెల్లరు హర్షధ్వనులు చేసి, జయజయ నినాదములతో భోజనంబులైన చేయకయే గృహోన్ముఖులైరి.

---

## ౧౦

"కాలము క్రిందు మీఁదగుట కానఁడుగాఁ గుజనుండు కొంచెముఁ"

గడియలు గడచినవి. దినములు తిరిగినవి. నెలలు పరు గిడినవి. సంవత్సరములు చనుచున్నవి. గడియలు గడచినకొలది,

దినములు తిరిగినకొలఁది, నెలలు పరుగిడినకొలఁది, సంవత్సరము లుచనినకొలఁది 'గతకాలము మేలు వచ్చుకాలముకంటె" నని పించుచున్నది. సంఘము కదలిపోవుచున్నది. ప్రాఁతపద్ధతులు పోయి క్రొత్తయాచారములు వచ్చిపడుచున్నవి. ఎవరికిఁ జిత్తమున శాంతిలేదు. సంఘములో స్థైమిత్యములేదు. సాధ్య సాధనములకు సామంజస్యములేదు. కర్మక్షేత్రము చీకాకు పడుచున్నది. ఏమతమునకు నిలుకడలేకున్నది. ఏకార్యమునకు స్థిరత్వము కుదురకున్నది. ప్రచండమారుతమున సంక్షుభితమగు జలధివలె మొగలితుర్రిరాజ్యము కుతకుత యుడికిపోవుచున్నది.

ఎంతకాలమీ సంక్షోభము! ఎంతకాలమీ ప్రచండ కల్లోలము! మానవజీవన మీ యొత్తిడిని భరింపలేకున్నది. క్రుంగిపోవుచున్నది. కుమిలిపోవుచున్నది. కుమారిల్లుచున్నది.

చాఱపప్పు సన్నబియ్యము తిని గట్టిని తేఁచి బొట్టలు నవరించుకొని కట్టలు చేతఁబుచ్చుకొని, పొలముల కేఁగురైతుల మొగములలోఁ గళకాంతులు లేవు. ప్రొద్దుటిపూఁట నిత్యకర్మా నుష్ఠానములు గావించుకొని రెండుజాముల వేళ మడ్రసోపేత భోజనంబులు చేసి, ప్రొద్దువాలఁగానే వీథియరుగులపైఁ గూరు చుండి శిష్యబృందమునకు వేదవేదాంగములయు, తర్కవేదాంత మీమాంసాదులయు, కావ్యనాటకాలంకార గ్రంథములయు పాఠంబులు చెప్పుచు నిశ్చింతమైనుండు పండితప్రకాండుల వద నారవిందముల నెక్కడను బ్రహ్మవర్చస్సు కానవచ్చుటలేదు. తాము నేర్చిన సాము, గరడీలు ఇరుప్రొద్దులఁ బ్రదర్శించుచుఁ

ప్రజలకుత్సాహము పురికొల్పుచుండు రాచవారిలో నైజతేజము స్ఫురించుటలేదు. అర్చకులు దేవాలయములలో దీప ధూప నైవేద్యము లిచ్చుచున్న జాడలు పొడకట్టుటలేదు.

రుస్తుమ్‌ఖాన్ రాజ్యాధిపత్యము వహించి పండ్రెండు నెలలు కావచ్చుచున్నది, 'ప్రతి-చోట' అరాజకపరిస్థితులే కానవచ్చుచున్నవి. అతని ధనతృష్ణకు హద్దు పద్దు లేకున్నది. పడవలకు, నావలకు, దోనెలకు, ఓడలకుఁగూడ సుంకములు విధించినాఁడు. ఒకమనుజుఁడు ఒకరోజున పదిమాఱులు రేవు దాఁటినఁ బదిమాఱులు నాపడవకు పన్ను చెల్లింపవలసినదే. వినోదముల కొకపన్ను, విద్యలకొకపన్ను, ఉప్పుఁగల్లుకొక పన్ను, చొప్పదంటు కొకపన్ను, పిల్లిపెసర కొకపన్ను, చల్లకొక పన్ను, పెరుఁగు కొకపన్ను, తోఁటల కొకపన్ను, దొడ్డుల కొక పన్ను, గుడ్డల కొకపన్ను, కూరల కొకపన్ను, నారఁ కొకపన్ను, బుఱ్ఱగొఱిగినఁబన్ను, గొఱిగించుకొన్నఁబన్ను, గొఱిగించుకొన కున్నఁబన్ను, బట్టలుఉతికినఁబన్ను, ఉతికించుకొన్నఁబన్ను, పిల్ల పుట్టినఁబన్ను, చచ్చినఁబన్ను, పేఁడకుప్పలకుఁబన్ను, పాఁడిమొద వులకుఁబన్ను, అమ్మినఁబన్ను, అమ్మకున్నఁబన్ను, కూలినాలులకు బన్ను, వస్తువమ్మినఁబన్ను, కొన్నఁబన్ను, తిన్నఁబన్ను, నిలఁబడి నఁబన్ను, కూర్చుండినఁబన్ను. ఇన్నిపన్నులను భరింపలేక వర్త కులు బేరసారములు కట్టిపెట్టిరి. రైతులు పొలములు బీడుపెట్టిరి. నావికులు ఓడలు ఒడ్డునకెక్కించిరి. కాఁపులు తోఁటలునాటుట మానిరి. విద్యార్థికు లుద్యోగములకు స్వస్తి చెప్పుకొనిరి.

కూలినాలివారు పనిపాటలుమాని పస్తులుండఁ దొడంగిరి. పాఠశాలలు మూయఁబడెను. కళామందిరములు నిరాలంబములయ్యెను. చదువుకొందమన్న వారికిఁ దావులేదు. అక్కఱలేదన్నవారికి నిర్బంధవిద్య. కాలువలలో నీరులేదు. నదులలో నావలులేవు. పంటలు కుంటువడిపోయెను. ప్రజలు కఱవుకాటకములచే మలమల మాఁడిపోవుచుండిరి. ప్రజలకు ఒంటినిండ గుడ్డ లేదు. కంటినిండ నిద్రలేదు. అన్నమో రామచంద్రా! యని యంగలార్చుచున్నారు. చెట్టుపైని పుట్టపైని మాత్రము చంద్రధ్వజములు ఎగురుచున్నవి. ఆ ధ్వజముల యండఁ జూచికొని రుస్తుమ్‌ఖాన్ నౌకరులు విశృంఖల విహారములుచేయుచుఁ బ్రజలను రాసి అంపానఁబెట్టుచు లంచగొండులై కొంచక తిరుగఁజొచ్చిరి. ప్రజలకు దిక్కు మొక్కు గనఁబడుటలేదు. పైరుపచ్చలచేఁ గనులపండువుచేయు సర్వరాష్ట్రలమంతయు నూషరక్షేత్రమయ్యెను. తమ కష్టముల నెవ్వరికిఁ జెప్పుకొందురు. ఎందుఁజొత్తురు. 'ఊఁ' అన్న నపరాధము 'ఆఁ' అన్న నపరాధము. ఏయింటఁ జూచినను ప్రొయ్యి రాఁజుటలేదు. దేశమంతయు నిప్పచ్చరమ్మునఁ దొప్పఁదోఁగుచున్నది. ఈ దుర్భర దారిద్ర్యస్థితి దక్షారామముదాఁక ప్రాఁకిపోయినది.

సస్యశ్యామలమగు భూఖండము తన కనులముందఱనే బీడువాఱుటను జూచిచూచి హసన్‌ఖాన్ సహింపలేకపోయెను. ప్రజానురంజకముగాని పరిపాలనము నొక్క క్షణమైనను కొనసాఁగనీయరాదని నిశ్చయించుకొనెను. ఆంతరంగికుఁడు, రాచ

కార్యముల నాఱితేఱినవాఁడు, ఉపధాశుచియైన రామయ్య పంతులను బిలువనంపి రావించి యర్ధాసనం బిచ్చి తన తండ్రి యొద్దకు రాయబారిగాఁ జని దౌత్యంబు నెఱపు మని యర్థించెను. తండ్రికిఁ దాను వ్రాసి పుత్తెంచెడు లేఖను ముందుగా పంతులకు వినుపించువాఁడై యిట్లు చదివెను.

"మేరే వాలిద్, మదజిల్లహూల్ ఆలా

రుస్తుమ్‌ఖాన్ బహద్దర్ గోల్కొండసర్కారు అమీన్ గారికి కుమారుఁడు హసన్‌ఖాన్ పెక్కులు సలాములు వందన సహస్రములు చేసి విన్నవించుకొను విజ్ఞాపనము—

మీరు గావించిన రాజద్రోహము క్షమింపరానిది. ఇటు రంగరాజుగారిని నమ్మించి గొంతు కోసినారు. అటు మీ కుద్యోగమిచ్చి పంపించిన గోలకొండ నవాబులను ధిక్కరించినారు. మీ రుభయత్ర విద్రోహులుగాఁ బరిణమించినారు. తిన్నయింటి వాసములు లెక్కించుట యిస్లామమతవిరుద్ధము. హిందూమత వ్యతిరేకము. మీరు ఇస్లాము మతము పేరితోఁ జాల నత్యాచారములు చేయుచున్నారు. నిత్యరమానివాసమై సుభిక్షమైన యీ మొగలితుర్తి రాజ్యమును మీరు చూచు చుండఁగా దరిద్రదేవతా విలయతాండవమునకు విహారస్థలమును గావించివైచినారు. ఏతల్లిపాలు త్రావి మన మింతవార మైతిమో యాతల్లి బొమ్మనే మీరు హృదయశూన్యులై దయాహీనులై గ్రుమ్ముచున్నారు. మీయట్టి నిర్ఘృణులను నేమతంబును నేమతప్రవక్తయు సహింపఁడు. మఱి మన దేశము

దేశములోని ప్రజలు అని యెఱుఁగుఁడు.

భగవంతుఁడు ఆస్తిపాస్తులను కేవలము మీ బ్రతుకుఁ దెరువునకే ప్రసాదించెనని తలంపకుఁడు. మీరు నేఁడు మీ దని మురియుచున్న యనంతసామ్రాజ్యము ప్రజలది. శ్రామికులయొక్క శ్రమయే! వెండి, బంగారు, రత్నములు, మేడలు, మిద్దెలు, వాహనముల రూపమును బొందిన దని గ్రహింపుఁడు. ఆదృష్టితోఁ బరిపాలించుటచేతనే రంగరాజుగారు ప్రజారంజకుఁడై, సత్యమూర్తియై, తేజోరాశియై, యసమాన మానమహితుఁడై పేరుగాంచినాఁడు. పిల్లలు వయసు వచ్చినతరువాత నడుగుదురను భయముచేఁ ద్వరత్వరగ వ్యర్థవ్యయ మొనర్చి వారి యాస్తిపాస్తులను ద్రవ్యమును మ్రింగివేయువానివలె వ్యవహరించు మీనడవడిక నెవ్వరును నేజాతియు హర్షింపదు. కృతఘ్నులను క్రూరులను భగవంతుఁడు ప్రేమింపఁడు. మీరు మన మతగ్రంథమగు ఖురఆన్ షరీఫ్ చిలుకపలుకులవలెఁ బఠించుచుందురు. కాని యేమిలాభము? "మీరు జరాభారముచేఁ గ్రుంగిపోయి శక్తిహీనులై వ్యవసాయకార్యములు నిర్వహింపఁజాలని పసిపిల్లలు గలవారై యున్నప్పుడు ఖర్జూరవృక్షములు, ద్రాక్షపందిళ్ళు సంతతముపాఱు కాలువలు గలిగి సమస్తఫలభరితమై యున్న మీతోఁట వేఁడిగాడ్పులచే మాఁడి మసిమసి యగుట నెవరుచూడఁగలరు" ఈ భగవద్వాక్యమును మీరు మరల మరలఁ బర్యాలోచించుకొనుఁడు. మననముచేసికొనుఁడు. దారిద్ర్యభీతిగొల్పి కని మిమ్ముల నిట్లు చెడునడవడి యలవఱచు

కొనఁ బ్రోత్సహించెనని తలంచి మీరు ప్రజలను గలంచుట ధర్మముగాదు. ప్రశాంతహృదయులై గుండెలపైఁ జేయివైచి కొని హాయిగానిద్రించిన ప్రజలెల్ల మీపరిపాలనమునఁ గూటికి గుడ్డకు మొగము వాచియుండుట మీకేగాదు ఉభయమతము లకుఁ గూడఁ దీఱని, మాయని, కళంకము.

తొడమీఁదఁ దలపెట్టుకొని పరుండిన మానిసిని కత్తి పెట్టి గొంతుకోయుటలోఁ బౌరుషము లేదు. మీరు దూర మాలోచించి మొగలితుర్తి రాజ్యమును వారి వంశస్థులకు నెవరి కైనసరే యొప్పఁజెప్పి చేసిన పాపమునకుఁ బశ్చాత్తాపమును వెలిపుచ్చుఁడు. పశ్చాత్తాపమునకు మించిన ప్రాయశ్చిత్తము మఱొకటిలేదు. శరీరములు క్షణబుద్బుదములు. ఐశ్వర్యములు తటిచ్చంచలములు. అస్థిరములైనవానిని నమ్మి మీరు స్థిరమైన యశస్సును బోఁగొట్టికొనకుఁడు. అవిమృశ్యకారితతో మీ రొనర్చిన మహాపరాధమునకుఁ దోడు మీరు చేయుచున్న దుష్పరిపాలనము భరింపరాని, సహింపరాని, క్షమింపరాని, యన్యాయ పరంపరా దూషితంబై చూపట్టుచున్నది. నిన్న మొన్నటిదాఁక వారి చెప్పుచేఁతలలోఁ బెట్టుపోఁతలలోఁ బెరిగి పెద్దలైన మీరు కఠిన పాషాణ కర్కశహృదయులై యిట్టి యెగ్గు బ్రజలకు రాజునకుఁ జేయుట యెంత లజ్జాకరమో యొకింత యోజించుకొనుఁడు. గతమునకు వగవకుఁడు. ఆగత మునకు అఱ్ఱులుచాఁపఁకుఁడు. వెంటనే ప్రజలనెల్ల రావించి వారి యిష్టానుసారముగా రాజ్యమును ఒప్పగింపుఁడు. వారందఱు

మిమ్ముల నే రాజుగా నుండఁగోరుదురేమో! అట్లేని నట్లేయుం డుఁడు. ప్రజాభిప్రాయము పాటింపక నిరంకుశముగాఁ బాలింపఁజూచు ప్రభుత్వము ప్రజాశక్తియను ఝంఝామారుతంబున నెగిరిపోవునుగాని నిలువఁజాలదు. మీరుకట్టినది ఇసుకమేడ. అది తనంత దానేకరిగి కూలిపోవును. దానినిగాంచి మీరు మురిసి పోవుట యజ్ఞానము. రాజకీయ ధురంధరుండైన రంగరాజుగా రెక్కడ మీరెక్కడ నక్కయెక్కడ? నాకలోక మెక్కడ? యొక్కసారి కనులువిప్పి పరికింపుఁడు. ఆ మహామహుఁడు చేసిన పరిపాలనంబు ఆయన రాజనీతిసారము మీరిన్నాళ్ళనుండి వారి సహవాసము చేసియు గ్రహింపలేనందుకుఁ జాల విచారించు చున్నాను. పూవులలోని దారముఁనకు సువాసన యబ్బునట్లు మీకును రంగరాజుగారి రాజనీతి యలవడియున్న నెంత చక్కఁగా నుండియుండును.

తుదిమాటలు రెండు వినుఁడు "ఎవఁడు నిరపరాధి జన ధన ప్రాణముల హరింపఁజూచునో వాఁడు తన సమాధిని దానే నిర్మించుకొను ననుమాట మఱువకుఁడు. తత్క్షణమే పుత్రుఁడ నైన నాయెడ విశ్వాసముంచి నా చెప్పినచొప్పున ప్రజాభి ప్రాయము ననుసరించి రాజ్యము పాలింపుఁడు."

అది విని రామయ్యపంతులు చాల సరసముగానున్నది. వెడలివత్తునుగాని తాఁ బట్టిన కుందేటికి మూఁడే కాళ్ళని మురియుచుండు మీతండ్రిగారు మీ యీ రాయబారమును మన్నించు నని నే నెన్నఁడుఁ దలంపను. కావున మీరు ఇప్పటి

నుండి ముందు ప్రయత్నములో నుండుఁడు. లొట్టిపిట్ట శూల
రోఁకటి పోటులం గాని లొంగదుగదా! మఱి నేను పోయి
వత్తునా !

హా:- అట్లే కానిండు. కాని పంతులుగారూ! యొక్క
మాట. నా యీయుత్తరము మీరు ముందుగా మాతండ్రి
గారికిఁ బంపకుఁడు. ముందు నాయొద్దనుండి మీరు వచ్చినసంగతి
యెఱింగించి యేవో యాంతరంగిక విషయములు ముచ్చటింప
వలసియున్నదని కబురుపెట్టుఁడు. ఎట్లో కోటలోనికి వెళ్ళి వారిని
దర్శించి రంగరాజుగారి రాజనీతి చతురతయెల్ల ముందు వ్రాస
గ్రుచ్చినట్లు చెప్పి పిమ్మట నాయుత్తరము నీయఁడు. మఱి
పోయిరండు. మీకు బుద్ధులుచెప్ప నే నెంతటివాఁడను.

అని సవినయంబుగా లేచి సాగనంపఁగా రామయ్య
పంతులు హాసన్ఖానునకుఁ గైలా గొసంగి కతిపయ ప్రయా
ణంబులకు అతి కష్టమువిూఁద మాఱుమూల మార్గముల
వెంటఁ జని చని మొగలితుర్తికోట దేవిడీయొద్ద కరిగి హాసన్
ఖాన్ వద్దనుండి తాను వచ్చిన సంగతి రుస్తుమ్ఖానునకు
ఎట్లో యుక్తియుక్తముగా నందఁజేసెను. ఐశ్వర్యమత్తుఁడై
యున్న రుస్తుమ్ఖాన్ గొన్ని గడియలసేపువఱకు అనుము
మినుము చెప్పక యెట్టకేలకు హజారమునకు రమ్మని
యాజ్ఞ యిచ్చెను. వెంటనే యాతఁడు నిర్భీకుఁడై లోపలికిఁ
జని రుస్తుమ్ఖాన్నకు సలా మొనర్చెను. ఖాను తిరిగి సలా
మొనర్పలేదు. కూర్చుండుండని సైఁగమాత్రము చేసెను.

చించుకొని యొక నిశ్చయమునకు వచ్చి వానిని బదచ్యుతునిఁ జేయక గార్యాంతరమున నియోగించెను. చొచ్చి సాధింప శక్యముగాని, పర్వతారణ్యములయందు నివసించుచు రాష్ట్రపీడ చేయుచుండునట్టి కిరాతుల నివాసములపొరుగు గ్రామములను, స్థితిలేని యితరశూరులకుఁ దాత్కాలికముగాఁ జీవనార్థ మిచ్చెను. వారిలో వారు పరస్పరము కలహించి చచ్చెడివారు. ఈయన పైనుండి పరిపాలించెను. అల్పసంతుష్టులగు బోయలను జెంచులను తన సత్యసంధతచేత సైవసముచేసికొనెను. తన యుత్తమాశ్వములను దన యుత్తమగజములను దన యాప్త యోధులకే యిచ్చెను. సభలో నొకఁడు ఒక పనిని సరిగాఁ గనిపట్టి తనకుఁ దెలుపఁగానే మఱొకఁడు దానిని కాదని నప్పుడు ఆమాటను గనిపెట్టి యా యిరువురమాటలను నిషేధింపక సంభావించి, పిమ్మట మొదటివాఁడు చెప్పినదానినే మన్నించి మేలొందెను. చక్కఁగా దీపించు జఠరాగ్ని కఫము మున్నగు దోషములచేఁ బ్రకోపించి మందగించినప్పుడు ఆదోషమును అణఁగించి యామాంద్యమును బోఁగొట్టి తిరుగ జఠరాగ్నికి దీప్తికలిగించు నౌషధములట్లు రాజు తన కుపద్రవ కారులైన దుష్టమంత్రుల స్థానములో సమర్థులను యోగ్యులను నియోగించెను. అధికారులు తమ జీవనమునకై తన్నుఁగొల్చు వారుగా నెఱింగి వారికి జీవనభంగముచేయక కాపాడెను. తన కష్టములోఁ దన్నుఁ జెఱుపనెంచిన వారినిఁగూడఁ జెఱుపలేదు. తన దేశమునకుఁ దగిన యాదాయము రాబట్టుటకై జలాధార

ములు నిర్మించెను. పంటకాల్వలు త్రవ్వించెను. పేదలకుఁ బన్నులు తగ్గించెను. నష్టపడి వ్యవసాయము మాని పనులు ఇండ్లు వాకిండ్లు ధాన్యము వదలుకొని పోవు జనుల నుపేక్షింపక వారిని రప్పించి, పెట్టుబడి పెట్టి కోలుకొనఁజేసెను. కాని, వారి ధాన్యములను బళులను, అమ్మి వారియిండ్ల కలప వంటచెఱకుగా నుపయోగింప లేదు. నీతిమార్గమును దప్పలేదు. ఎల్ల విషయములు తానే తెలిసికొనుచుఁ దెలియనివానిని ఆప్త మిత్రబృందమువలన నెఱింగికొనుచు నుండెను. కాని తన మతమే జరుగవలయునను దురభిమానము నెప్పుడును బెట్టుకొనలేదు. ఆపదలందు పరాధీనుఁడు గాలేదు. ఉగ్రముగా నెవరిని దండింప లేదు. ఎలుఁగుబంటివలె నొకకన్నుమాత్రమే మూసి నిద్రించెను. సన్యాసులు మున్నగువారి విద్యలకు మెచ్చినాఁడు గాని వారికి ధనములు భూములు గ్రామములు ఈయలేదు. దండనార్హులకుఁ గూడ క్షమార్పణ చెప్పుకొను నవకాశ మిచ్చెను. అన్యదేశములనుండి గుఱ్ఱములు, ఏనుఁగులు, రత్న చందన మౌక్తికాదులు రావించి వర్తకము పెంచి రేవులయందు దిగుమతికి సౌకర్యములు గలిగించెను. అనావృష్టివలనను, రోగముల మూలముననను, ఉపద్రవమువలనను దన దేశమునకు వచ్చిన పరదేశస్థులను వారివారి జాతికిఁ దగినట్లు పోషించెను. తన తోఁటలు, దొడ్లు, పశుల మందలు, స్వర్ణరత్నఖనులు ఆప్తవర్గము స్వాధీనము నందుంచెను. ఎవరిని గఠినముగాఁ దండింపలేదు. కొండెములకుఁ జెవియొగ్గలేదు. సంధికోరిన

శత్రువును ద్రోసివేయలేదు. అవిశ్వాసులం జేరందీయ లేదు. నమ్మినవారినిం జెఱుపలేదు. వేఱుపఱుపలేదు. మంత్రాలోచనలో మోమోట పడలేదు. మంత్రము వెలింబుచ్చినవానిని సహింప లేదు. ఉత్పాతములకు శాంతి చేయింపక యుపేక్షింపలేదు. పూజ్యుల నవమానింపలేదు. నీచులను నెత్తినెక్కించుకొనలేదు. మాత్సర్యము వహింపలేదు. సప్తవ్యసనంబులం దగుల లేదు. కలహప్రియుండు కాలేదు. కావుననే యింతకాలము యింత రాజ్యమేలం గల్గెను. అట్టి మహారాజు రాజ్యమును మీరురిత్తకు రిత్తహరించుట కూడదనియుం బ్రజల నధికతరమగుపన్నులచేం బీల్చి పిప్పిచేయుట తగదనియు మీకుం దెలుపుచు మీ కుమారులు హాసన్ ఖాన్ గారిదిగో నీలేఖవ్రాసి మీకుం బుత్తెంచి నారు. మీరు దీనిని సావధానంబుగాం జిత్తగించి తగిన నదుత్తరంబీయుండు. లేనినాండు మీరు తుది యపాయంబు నకుం బాత్రులు కాక తప్పదు. నదుమంత్రపు సిరికిం గులుకు చెందకుండు. ఇల్లలికినంతమాత్రంబునం బందువుకాదు." అని లేఖను చేతి కీయంగానే యాతండు దానిని జదివి చించి కాలి క్రింద వేసి నలిపి యుమిసి లోనికిం జనెను.

ఆయవమానమును భరింపలేక యాతండు 'మొంగలితుగ్రి కోటపైం జంద్రిధ్వజము దింపించి సూర్యధ్వజము స్థాపించు వఱకు మంచముపైం బరుండను కంచములో భుజింప' నని ప్రతి నవట్టి హాసన్ ఖానును గలిసికొనుటకై ప్రయాణమై చనెను.

---

'అయ్యసంబద్ధునితోడ సంధికి నుపాయము నామది దోఁ పదెమ్మెయిఁకా'

శ్రీకృష్ణదేవరాయలచేఁ బరిపాలింపఁబడిన హాంపీ విజయ నగరమున కెందును దీసిపోక సమస్తవైభవములు గలిగి పూసపాటివారను నుత్తమక్షత్రియులకునికిపట్టై రాజధానీ నగరమై విజయనగరము విశాఖపట్టణమండలమున వాసికెక్కుచుండును.

తన వాఁడి కరవాలముచేఁ బిడుగును నఱకిన చిక్కభీముఁడును, శ్రీ కనకదుర్గా కరుణా కటాక్ష వీక్షణములకుఁ బాత్రుఁడై విజయవాడలో నేడుగడియలసేపు కనకవర్షము కురిపించిన మాధవవర్మయు నాపూసపాటి వంశమందు జనించిరి.

జగద్విఖ్యాత యశోవిరాజితులైన యా మహారాజుల వంశము వాఁడె రంగరాజు మహారాజుకుమార్తెయైన యమ్మాజీ భర్తయగు నానంద మహారాజు.

ఈతఁడు అష్టాదశ భాషావేత్త. అసహాయ శూరుఁడు. కత్తిని గంటమును సమానముగా నడపు మేటి. ఆయన కన్ని విధములఁ దగిన యిల్లాలు అమ్మాజీ. గంటముపట్టి వ్రాయుటయేకాదు కత్తిపట్టి యరివీరుల శిరములఁ దునుమాడఁగలదు.

ఆమెయానాఁడు కలిదిండి వంశాంకురమైన చంటిబిడ్డను ముందు రుస్తుమ్‌ఖాను కంటఁబడకుండ దాఁటించి పిమ్మట వాని బారినుండి తానును దప్పించుకొని శిశుసంరక్షణార్థమై కోలంక చేరెను. చేరుటయేతడవుగా హసన్‌ఖానునకు రక్షాబంధమును గూడఁ బంపి రుస్తుమ్‌ఖాన్ మీఁదికి గత్తి దూయించెను.

అమ్మాజీ కోలంక చేరిన కొలఁదినాళ్ళకే మొగలితుర్తి పరిస్థితులన్నియుఁ బూసగుచ్చినట్లొక లేఖ వ్రాసి తన భర్త యొద్దకుఁ బంపించెను. లేఖావాహకుఁడు పరులకంటఁ బడకుండ విజయనగరము చేరఁగలిగెను.

ఆనందరాజు 'మోతీమహాలను' తన దర్బారు మందిరములో రత్నఖచిత స్వర్ణ సింహాసనంబునఁ గూర్చుండి తన యర్థాంగి పుత్తెంచిన యుత్తరము ముద్ర భద్రముగాఁ దీసి యిట్లు చదువుకొనెను.

'నాథా! నేను పుట్టినింటికి వచ్చి చాలనాళ్ళైనది. క్షమింపుఁడు. ఇక్కడ పరిస్థితులన్నియుఁ జాల విషమించినవి. మా తమ్ముఁడు చిరంజీవి రామరాజు సంసారముపై విరక్తిగలిగి నిండుచూలాలగు మా మఱఁదలనుగూడ వదలిపెట్టి తపస్సునకై యడవులఁకేగెను. నాయనగారు పుత్రప్రేమ పట్టలేక రుస్తుమ్‌ఖానునకుఁ గోట యప్పగించి దమ్ముని వెదకుటకై వెడలిరి. ఇంతలో మఱఁదలు ప్రసవించి మగశిశువును గని మరణించినది. ఆస్థితిలో రుస్తుమ్‌ఖానునకు దుర్బుద్ధిపుట్టి చంటిబిడ్డను జంప నుద్యుక్తుఁడయ్యెను. నేనాబిడ్డను వానికంటఁ బడకుండ రక్షించుకొని వచ్చి కోలంకఁ జేరఁగల్గితిని. రుస్తుమ్‌ఖాన్ కోటనాక్రమించుకొని తానే రాజ్యాధిపతియై మనుమఁడు గలిగినాఁడన్న యానందముతోఁ దోఁటపల్లికొండలనుండి తిరిగివచ్చుచున్న నాయనగారిని రాజోలునొద్ద బంధించి నగరములోఁ జెఱపెట్టెను. నిరుడు అంతర్వేది తీర్థసమయమున రథము కద

లకపోవుటచే అర్చకుఁడైన యప్పలాచార్యులుగారి స్వప్న వృత్తాంతముచేఁ బ్రజలు నగరమునకేఁగి నాన్నగారినిఁ దీసికొని వచ్చి రథోత్సవమున కుపక్రమించిరి. నాన్నగారు అరదపుఁ దాఁటిపైఁ జేయివేయఁగానే రథము కదిలినది. కాని నాన్న గారు రథచక్రముక్రింద నలిగిపోయినారు. ఇఁక నేమిచేయు మందురు ? మొగలితుర్తి సామ్రాజ్యనావ నడిసముద్రములో మునిఁగిపోయినది. నేను మన రాజపుత్రస్త్రీల యాచారము వహించి రుస్తుమ్‌ఖాన్ కుమారుఁడైన హాసన్‌ఖానునకు రక్షా బంధమును బంపినాను. అతఁడభయమిచ్చి తనతండ్రిపైకి యుద్ధ సన్నద్ధుఁడైనాఁడు. వేడినీళ్ళకుఁ జన్నీళ్ళు సాయమనునట్లుగా మీరుగూడఁ గొంతసేనను బ్రచ్ఛన్నముగాఁ గోలంకకుఁ బంప గోరెదను.

ప్రతిరాజ్యములోను అంతశ్శత్రువులు సమయమునకై నిరీక్షించుచుందురు. కావునఁ దాము ప్రస్తుతము రానవసరము లేదు. పనిగలిగినచోఁ దాము దయచేయుని లోటు రానీయ కుండ నే నుండి చూచెదను. ఉభయ రాజ్యక్షేమంబులుగోరి దూర మాలోచించి యిట్లు వ్రాసికొన్నాను. నాయీ చనువు నకు సాహసమునకు మన్నింపుఁడు.

మకాము, కోలంక. }

ఇట్లు,
మీ అమ్మాజీ.

ఆయుత్తరములో పత్యక్షరమునకుఁ బ్రతిపంక్తికి ఆ యనచూపులు పరిసరించుచు అగ్నివిస్ఫులింగములఁ గ్రక్కు-

చున్నవి. మోము అశోకపుష్పములకాంతిని వహించెను. పెదవు లదరెను. మేను కంపించెను. ప్రళయకాల పర్జన్య గర్జానుకారి యగు భీషణస్వరంబుతో భటునిఁబిలిచి సేనానాయకునిఁ దీసి కొని రమ్మనెను. ప్రకృతిచే శాంతమూర్తియగు నాతని భీకర ధ్వనికిఁ గారణము తెలియక గడ గడ వడఁకుచుఁ జని భటుఁడు క్షణకాలములో సేనానాయకునితోఁ బ్రవేశించి తానటనుండి తొలఁగిచనెను. ఆనందగజపతి మంత్రనంబుండి యేమి యాజ్ఞ వెట్టెనో, విలానములు భుజములపై వైచికొనిన ఐదువందల మంది నాటువర్తకులు దక్షారామసుముఖంబుగా బయలుదేతిరి.

రామయ్యపంతులు స్వభావముచే శాంతపురుషుఁడే కాని యవమానమును భరింపలేఁడు సాదురేగినఁ దలపోల మునఁగాని యాఁగ దన్నట్టు లతఁడు ప్రతినపట్టినచో దానిని సాధించి తీరవలసినదే! తనప్రతిజ్ఞ నిలుపుకొనుటకై యతఁడెం తటికైన సాహసించును. అనమానవమానమహితుఁ డగు నాతఁ డాత్మ గౌరవమునకు హానికలిగి నవుడు బ్రహ్మాండములు తల క్రిందుచేయఁగలఁడు. సముద్రము లాపోశనము పట్టఁగలఁడు. పర్వతములు వండలిపిండు చేయఁగలఁడు. దిగ్దంతుల కోఱలు పెఱకఁగలఁడు. వేయేల యాతఁడు తలపెట్టిన యే కార్యమందును అపజయ మింత వఱకుఁ గాంచి యెఱుఁగఁడు. కావుననే రామచంద్రపుర పురాధీశ్వరులు, కాఁకరలపూఁడి వజీ రులు, క్షత్రియకులాలంకారులు, రామయ్యపంతులను ఆయన పూర్వులను వంశపరంపరాగత మంత్రులుగా మన్నించుచు

న్నారు. ఆనాఁడు అంతర్వేదిలోఁ బ్రజాసమూహమును హెచ్చరించి; హసన్‌ఖానునొద్దకుఁ దీసికొనివచ్చిన దీమహామేధావియే. ఈయన చిరకాలమునుండి శ్రీ రాజా కాఁకర్లపూఁడి నారాయణ గజపతిరాజుగారియొద్దఁ బ్రిధానిగా నుండెను. తనరాజుగారియుఁ, దనవియు మ్రొక్కుబడులు లక్ష్మీనృసింహస్వామి వారికి సమర్పించుకొనుటకై యానాఁడు అంతర్వేదికి వచ్చెను. అటు విజయనగరము పూసపాటివారు, ఇటు పెద్దాపురము వత్సవాయివారు, అటు రామచంద్రపురము కాఁకర్లపూడివారు, ఇటు మొగలితుఱ్ఱు కలిదిండివారు సన్నిహితబంధువులగుటయే కాక యుద్ధావసరము లప్పుడొకరి కొకరు సాయపడుచుండిరి. వీరిలోవీరు ఎల్లలకై తగవులుపడకుండ ఈరామయ్యపంతులును మొగలితుర్రి దివానగు పెనుమెచ్చ వెంకయ్యయు, వేయి కన్నులతోఁ గనిపెట్టుచుఁ గాచుచునుందురు. ఈరాజులెవ్వరును ఈయిరువురిసలహాలను తిరస్కరించి యెఱుఁగరు. వీరిరువురు దివానులుగానున్నను వంగివంగి సలాము లెన్నఁడును తమరాజులకుఁ జేయులేదు. అడుసు త్రొక్కలేదు కాలు కడుగలేదు. కావుననే యందఱకుఁ దలలోనాలుకలై పూసలలోదారములై ఖ్యాతి గాంచినారు. వెంకయ్య రామయ్యపంతులలో నెవరు ప్రతిభావంతులో నిర్ణయించుట కష్టము. కొందఱు వెంకయ్య సహజప్రజ్ఞ కలవాఁడందురు. కొందఱు రామయ్యపంతులు పూర్వులు ఏడుతరములనుండి మంత్రులగుటచే వెంకయ్యగారి కంటె రామయ్యగారికే యెక్కువ యనుభవజ్ఞానము కలదని

చెప్పుకొనుచుందురు. ఎవరేమనుకొన్ననేమి? వారిరువురకు మాత్రము ఒకటే ప్రాణము. తఱచు వీరిరువురు కోలంకలోఁ గలిసికొని రాజకీయ విషయములు చర్చించుకొనుట యలవాటు. వారిచర్చలలో గెలుపోటము లెవరికిలేవు. ఏది చక్కనిపథమైన నావిధముగా నడచుకొనుటయే వారినీతి. వెంకయ్య తాను మహాసామ్రాజ్యామాత్యుఁడ నని గర్వించి సామాన్యరాజ్యము నకుమంత్రియైన రామయ్యనెప్పుడును ఈసడింపలేదు. రామయ్య వెంకయ్యయంత పొడగరి, బలశాలి కాఁడు. బక్కపలుచని చక్కని మేనివాఁడు. అతనిచూపులు జంద్రజ్యోత్స్నలు. పలుకులు అమృతధారలు. కావున ఎట్టివారినైన నిట్టే కరఁగింపఁ గలఁడు. వెంకయ్య మంత్రిగానున్న రాజ్యమునకుఁ దటస్థించిన యాపద కాతఁడు మఱి కుమిలిపోయెను. అంతర్వేదిలోనే యతఁడు రుస్తుంఖాన్‌పనిపట్టుటకు మనస్సులో దృఢనిశ్చయము చేసికొనెను. అదిఫలింపఁజేయుటకే నివురుగప్పిన నిప్పువలె నచ్చటి జనసామాన్యమును దనవెంట హసన్‌బాదాకు గొని వచ్చెను. తరతరములనుండి క్షత్రియుల సొమ్ము తినుచున్నా మను నభిమానము వాని యస్థిని బట్టియున్నది. అందుచేతనే రుస్తుంఖానును ఓడించుట కానాఁడే విఘ్నేశ్వరపూజ చేసెను. ఈలోఁగానే రెండవకంటివానికిఁ దెలియకుండ నొకసంవత్సరము హసన్‌ఖానునొద్దఁ దాను ప్రెగ్గడగానుండుటకుఁ దనరాజునొద్ద ననుమతి పొందెను. తత్ఫలితమే తాను రాయబారితనము వహించుటలోఁగల యాంతరంగిక విషయము. అతఁడేకార్య

మును రాయబారియై తలఁబెట్టుకొనునో యావని నెఱవేఱు వఱకు నిద్రపోఁడు. మొగలితుర్తిలో రాయబారము విఫలము కాఁగానే యట్లు ప్రతిజ్ఞసేసి హుటాహుటి హాసన్ బాదాకు రాక దారిలో మధ్యమధ్య వివిధ ప్రాంతములలోనున్న తన కెఱుకగలిగిన నమ్మఁదగిన వివిధకులముల పెద్దలతోఁ దనప్రతిజ్ఞను దెలిపి సమయము వచ్చినపుడు తాను ఉప్పందింపఁగనే యెవరికిఁ దగిన సాయము వారినిఁ జేయవలసినదని చెప్పి యొప్పించి మఱివచ్చెను. అతని యుపదేశమునంజేసి నానా వర్ణములవారు కులమత వివక్షత లేకుండ నవసరము వచ్చి నప్పుడు నసువుల నర్పించుటకు బాసయిచ్చిరి.

హాసన్ ఖాన్ రామయ్య పంతులును రాయబారిగా మొగలితుర్తికి పంపిననాఁటినుండియుఁ దంత్రిత్వము బాగుగా నెఱిఁగినవాఁడగుటచే దండనీతికి వలయు సాధన సామగ్రి నంతయు నిగూఢముగా నాయత్తపఱచుచునే యుండెను. అతఁడు కార్యవాదిగాని ఖడ్గవాది కాఁడు. ఒకవేళ ఖడ్గమే ధరించి కార్యము చక్కఁ జేయవలసివచ్చినచో దానిని ధరించుటకు వెనుకంజ వేయువాఁడు గాఁడు. మృత్యువునకు వెఱవనివాఁడె ధీరుఁడు వీరుఁడు స్వతంత్రుఁడు నని యతని దృఢవిశ్వాసము. అట్లని పిఱికిచావు నిచ్చగింపఁడు. ముఱికి బ్రతుకును గోరఁడు. దేశము స్వయంసమృద్ధముగ, సంఘము స్వయంపోషకముగ, వ్యక్తి స్వతంత్రుడుగా జీవింపవలయునని యాతని కోరిక. ఆ కోరికకు భిన్నముగాఁ బరిపాలించు ప్రభుత్వమెట్టిదైనను ఎవరి

దైననుసరే దానిని ఏవిధముచేతనైన రూపుమాపవలయునని యాతని దృఢసంకల్పము. అతఁడు పాదముపెట్టిన కొలఁది నాళ్ళకే భీమఖండ మంతటను బలు తెఱఁగుల ఫలవృక్షముల నాటించి నందనవనముఁ జేసెను. దక్షారామమున నలుగెలఁకు ద్రాక్షతోఁటలు నాటించి కాయమానజటిల ద్రాక్షాగుళుచ్ఛంబులచే ద్రాక్షారామము చేసివైచెను. తాను స్వయముగా వడికి నేసికొనిన బట్టలనేగాని యందమునకై యేఢకా-మజిలినులును అతఁడు ధరింపలేదు. ఏపనినైనఁ దానాచరించి యాచరింపఁ జేయునుగాని యుత్త ధర్మపన్నముల నేకరువు పెట్టఁడు. కావుననే యతని చెప్పుచేతలలో అడుగుజాడలలో నడచు జనసంఖ్య యగణ్యముగానున్నది. తాను దలపెట్టిన యీ నిర్మాణాత్మక కార్యమునకుఁగూడ దనతండ్రి దుష్టపరిపాలనము అడ్డుతవిలి దేశము నిర్వీర్యమై నిస్తేజమై యున్నమునకుఁ మొగమువాచి యుండుట కతఁడు కటకటపడి పోవుచుండెను. క్షణ మొక యుగముగా రామయ్యపంతులు రాకను నిరీక్షించుచుండెను. తనతండ్రి తనమాటను బాటించునని యతఁడు స్వప్నమందును ఊహింపలేదు. పరిసర పరిపాలకులయు, రాజ్యములోని ప్రజయు సదభిప్రాయమును బడసి తప్పు తనతండ్రిదేయని యనిపించుటకే యతఁ డంత యోపిక పట్టియుండెను. అదే యతని రాజ్యాంగ చతురతలోని చమత్కారము. అమ్మాజీ పంపిన రక్షాబంధము తానుధరించి యించుమించుగా నేఁడాది కావచ్చినను ఇందనుక నోపిక యందులకే పట్టెను. పైగా, ఒకరోజు

కడచినకొలఁది రుస్తుంఖానుచేయు నొత్తిడివల్లఁ బ్రజలు నలఁగి పోవుచుందురు. నలిగినలిగి యలిగి యెక్కుమ్మడి విప్లవము రేకెత్తింతురు. అట్టి పరిస్థితి సంభవించఁగానే తాను వారికి నాయకుఁడై దుష్ప్రభుత్వముపై, దండయాత్ర ప్రకటించినచో అనాయాసముగా గమ్యస్థానమును జేరఁగలిగి విజయము గాంచ వచ్చునని యెంచెను. వాతావరణమంతయు ననుకూలమై దేశ కాల పరిస్థితులు చక్కఁగానున్నప్పుడే యుద్దిష్టకార్యము నెఱ వేర్చుకొనవలయునను భారతనీతి నతఁ డుగ్గుబాలతో నేర్చెను. నిగ్గుతేలిన యోధులను గూర్చెను. క్షైత్రియాత్రికై భేరీ ప్రమోఁగించుటకు సిద్ధముగా నుండెను.

మాఘమాసమున శుక్లపక్షమున దశమినాఁడు పగలు పదునొకండు గడియలవేళ రామయపంతులు హసన్‌బాదాకు వచ్చిచేరెను. కన్నులువిప్పుకొని వానిరాకకై యెదురుతెన్నులు చూచుచున్న హసన్‌ఖాన్ మందస్మితముతో నాలుగడుగులు ముందునకువైచి చేయిపట్టుకొని కుశలమడిగి తన యుద్యాన వాటికలో నొకమూలనున్న లతామండపమునకుఁ దీసికొని పోయి రత్నకంబళముకన్న మెత్తగా సొగసుగానున్న పచ్చిక పఱపుపైఁ గూర్చుండఁబెట్టి మార్గాయాసంబు డిందుపఱుపఁ జెఱకురసంబును, కదళీఫలంబులను, ద్రాక్షపండ్లను దెప్పించి స్వీకరింపుఁడని ప్రార్థించెను.

అతఁడు వానిని వేనిని గైకొనక మంచినీళ్ళుమాత్రము త్రావి యించుక సేపు పచ్చికపై మాట్లాడకుండ నరమోడ్పుఁ

గన్నులతో మిన్నునుఁ జూచుచుఁ బరుండెను. హాసన్ ఖాన్ వాని వాలకమునుగాంచి యేదో మహాప్రళయము సంభవించిన దని యూహించెను. అసాధ్యకార్యముల సాధింపనెంచిన సమయములయందెల్ల నాతఁ డాతీరునఁ బండుకొని యోజించుట పరిపాటియగుట హాసన్ ఖాన్ బాగుగానెఱుఁగును. కావుననే తానును అచటనుండి లేచి కొంచెంగ దూరమేగి యటునిటు పచారుచేయుచుండెను. రెండుగడియల ప్రొద్దగు (కాలము) నప్పటికి రామయ్యపంతులు లేచి కూర్చుండెను. విస్ఫారిత నేత్రుఁడై యటునిటు చూచెను. ఆచూపు అతఁడు తానను కొన్న కార్యమున నొక నిర్ణయమునకు వచ్చినట్లు వెల్లడి యయ్యెను. వెంటనే హాసన్ ఖాన్ వానిదగ్గఱకువచ్చి కూర్చుండెను. భటులు దూరముగాఁ దొలఁగిచనిరి. వారు వెడలిపోవుట తడవుగా హాసన్ ఖాన్ —

పంతులుగారూ! మీరేదో తీవ్రాలోచనలో మునిఁగి నట్లుకానవచ్చుచున్నారు. మాతండ్రిగారు సుఖమున్నారుగదా.

రా:— హాసన్ ఖానుగారూ! చెప్పుటకేమున్నది. మన తిప్పలు మనకుఁ దప్పవు. మీతండ్రిగారి స్వభావము ఎంత సాఫీయైనదో మీరెఱుఁగనిది కాదుగదా. మాట తేనెగా నీయన యిన్నినాళ్ళు మహారాజును, లోకమును, మమ్ములను, తుదకుఁ గుమారులైన మిమ్ములనుగూడ వంచించెను. అర్థాతురులకు భయము, లజ్జ యెట్లు కలుగును. ధనాశ చేయింపని దేమియుండును! ఆయాశకు దాసులుగానివారు మీవలె రంగ

రాజు మహారాజుగారివలెఁ గోటికి నూటికి నేరెక్కుదైన నుందురేమో. ఆయాశ చేయింపని చెడుకార్యము లేముండును అది త్రాగించును, దోపించును, తందనాలాడించును, మంచి చెడ్డ, పిల్ల మేక యనకుండ నందఱను హింసింపఁజేయును. మానాభిమానముల మంటఁ గలిపించును. గౌరవ ప్రతిష్ఠల గంగపాలు చేయించును. ఎదుటివాడు తిన్నను పస్తులున్నను దాని కక్కఱలేదు. వారి రక్తమాంసములు అడుసుచేసి, వారి యెముకలప్రోవులను ఇటుకరాళ్ళుచేసి తన విలాస భవనములను నిర్మింపఁజేసి యందుఁ దాను సుఖలాలసయై విహరింపఁ జూచును. దాని యూహాగానములకుఁ దెగ తెంపు లుండవు. దాని రాగాలాపములకు మొదలు తుది యుండదు. దాని పద విన్యాసములకు దారి దెన్నులుండవు. దాని తాళగతులకు అంతుపొంతు లుండవు. తన కనులముందు జడజడ ఘుళఘుళ కూలిపోయిన, కూలిపోవుచున్న దురాశా సౌధములను జూచియు దానికి లేశమయిన వివేక ముదయింపదు. హృదయ పరివర్తనము కలుగదు. అది ప్రాపంచకజ్ఞానమును జారిత్రిక జ్ఞానమును, బురాణ జ్ఞానమును, నవీనజ్ఞానమును గూడ క్షణ ములో నాశనముచేసి మహాంధకూపమునఁ బడఁద్రోసి నిర్గమన మార్గము లేకుండఁ జేయును. ధనాశాబద్ధుఁడు కానివాఁడు ప్రపంచములో నుండఁడు కాని మిూతంద్రివలె గులామైనవాఁడు ఎక్కడను గానరాఁడు. అతఁడు తనగోతిని దానే త్రవ్వుకొను చున్నాఁడు. తన సమాధిని దానే నిర్మించుకొనుచున్నాఁడు.

విధివశంబు తప్పింప నేరికితరము ? నొసటనువ్రాసిన వ్రాలు
నూఱేండ్లు చింతించినను దప్పదుగదా? లేకున్న మానాన్నకిన్ని
వక్రబుద్ధులు పుట్టవు. నెఱమగంటిమిమై రాజ్యములు జయించి
పేరుకీర్తులఁ గాంచినవాఁడు గర్వించినఁ జెల్లుఁగాని, స్వామి
ద్రోహముచేసి యార్జించిన పిసినిగొట్టునకా యింతగర్వము !
అంత పొగరుఁబోతుతనము ! నేను ఒక మానవుఁడననియైనఁ
దలంపవలదా ? అంతలేసి యమానుషచర్య లాచరించునా !
ఎంత పనికిమాలిన బ్రాహ్మణుఁడనైనను ఉప్పు, కారము తిను
చున్నానుగదా ! ఆత్మగౌరవమనునది చచ్చిపోదుగదా ! తన
కుమారునియొద్దనుండి వచ్చిన రాయబారిననియైనఁ దలంప
వలదా ? పోనీ ! గృహస్థు మర్యాదనైనఁ జూపరాదా ? నేను
పుట్టి పెరిఁగి యనేకుల రాజులను జూచినాను. కత్తిమీఁద
నొరఁగు నుక్షత్రియులయొద్ద మంత్రిగా నున్నాను. ఇంత వింత
మానిసిని ఎచ్చటఁజూడలేదు. ఎంత పరికించి చూచిన నుంత
యైన వాని యంతఃకరణమున దయారసముగాని మానవత్వము
గాని కానరాలేదు. నారాక తెలుపఁగానే లోనికి రమ్మనెను.
తాను గూర్చున్నచోటుననుండి లేవలేదు సరేకదా నన్ను
లోనికిరమ్మన్నవాఁడు నేను గూర్చుండుట కొక బల్లగానీ కుర్చీ
గానీ, వేయింపలేదు. బహుశః నన్నవమానపఱచుటకై యా
గదిలోనున్న యాసనాదులు ముందుగానే తీసివేయించె నను
కొందును. సరే కానిండు. చెడుకాలము దాపురించినప్పుడు
మంచిబుద్ధులు పుట్టవుగదా? తొలుత నేను రామరాజుగా రవ

లంబించిన రాజనీతిసారము ఆనుపూర్వికముగాఁ జెప్పి మీ యుత్తరము నిచ్చితిని. అది చదివికొని చెడావుల క్రిందఁబెట్టి నలిపి నలిపి తిరిగి నాతో నేమియు సమాధానము చెప్పకయే యభ్యంతర మందిరమున కరిగెను. ప్రజాపీడనమే వాని వినోద క్రీడ. ఇంతకంటె రాక్షసకృత్యమేమికావలయును. కోఱలున్న వారే రాక్షసులుగారు. స్వలాభమునకై ప్రజల రక్తమాంస ములు పిండువారే రాక్షసులు. దారులుగొట్టువారే బందిపోటు దొంగలుగారు. భరింపరాని సుంకములచే మానవుల సొంకము లణంచువారే బందిపోటుదొంగలు. కోఱలులేక పోయినను బ్రజల రక్తమాంసములను బీల్చికొని తాగిపొట్టలుపెంచుకొను వారికన్నను, దారులుకొట్టకుండఁ బ్రజను దోచుకొనువారి కన్నను, రాక్షసులు బందిపోటుదొంగలు వేఱగలరా? చీనిచీ నాంబరములు దరించువారిని చినిఁగినగుడ్డనైన పాఱవేయుటకుఁ జేతులురాక, గతిలేక వానినే కుట్టి కుట్టి కట్టుకొనునట్లు చేసి, రాజాన్నములు పప్పునేతులతోఁగల్పి భుజించువారినిగుప్పెఁడు మెతుకులకై యేడుంగలార్చువారినిగాఁజేసిన నీతండ్రికి నారాయ బారముగాని మీయుత్తరముగాని హృదయపరివర్తనము ఎట్లు గలిగించును? పట్టెఁడన్నమునకు జానెఁడు గుడ్డకుఁ బ్రజలు నోచుకొనకుండఁజేసి బొక్కసమును వెక్కసముగాఁ బెంచు కర్క శులను ఇఁక మన మొక క్షణమైన సహింపరాదు. ఈ మాఘ శుద్ధమందే మనము ససైన్యులమై మొగలితుఱ్ఱునకుఁ బోయి రుస్తుమ్‌ఖాన్‌గారు మనయెడఁ జూపిన మర్యాదకుఁ దగిన గుణ

పాఠము నేర్పవలయును. సత్యాహింసలను గాపాడుటకై యొకప్పుడాయుధబలము నుపయోగించవలసిన యగత్యమేర్పడినచో వెనుదీయరాదని మహాత్ములవచనము. కాన మనమింక ముందు కార్యమునకై కడంగ వలయును."

అనియనుచున్నంతలోఁ బరిచారికవచ్చి బిడారువర్తకము చేయు బేహారులయిదువందలమంది వచ్చి హసన్‌ఖాన్‌గారిదర్శనము నపేక్షించుచున్నారని చెప్పెను. అది విని రామయ్య పంతులు అయిదువందలమందియా! ఎక్కడనుండి యనెను?

పరిచారిక:—విజయనగరమునుండియఁట. వారెంత పయనపుఁ బడలిక చెందినను దృఢకాయులుగాఁ గన్పట్టుచున్నారు. ఎత్తైన మడములు, మేఁకాళ్ళుకలియని, దొడ్డిలేని కాళ్ళు, విశాలములైన ఱొమ్ములు, కండలుదేఱిన యొడళ్ళు, కాయలు గాచిన చేతులుగలిగి యున్నారు.

వారిరువురు గంభీర హృదయులగుటచేఁ దొందరపడక చెక్కుచెదరక దృక్కులచేఁ బ్రసరింపఁజేసి చూచుచుండిరి. కాని యెందుండివచ్చిరి? "యేమిపని? యని ప్రశ్నింపరైరి. ఆవచ్చినవారును ఇందులకు వచ్చితిమి. ఇది పనియని, చెప్పరైరి. ఈరీతిగా నాలుగుగడియలకాలము గడిచినది. ఇంక నొక గడియలో లోకబాంధవుఁడు జగన్నాటక యవనికచాటున కరుగుటకు సిద్ధముగా నున్నాఁడు.

అంతలో నొక యాశ్వికుఁడు చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటి బిడ్డను గుఱ్ఱముపైఁ గూర్చుండఁబెట్టుకొని వచ్చి తటాలున హసన్‌ఖాన్ నిలిచిన యారామవీధిని నిలిచెను.

ఆదివ్యసుందరమూర్తినిఁజూచుటతోడనే హాసన్‌ఖానును రామయ్యపంతులునుగూడ నొక్కమా యులికిపడిరి. ఆశ్వికుఁడు వారినిఁజూచి తటాలున గుఱ్ఱము డిగ్గి, యొకచేతఁ గళ్లెముబట్టుకొని యొకచేత గుఱ్ఱముపైనున్న బిడ్డను జాఱిపోకుండఁ గాపాడుచు పదియడుగులు ముందునకు వచ్చెను. చెట్టుకొకఁడుగా గూర్చుండియున్న వర్తకులందఱుగూడ నాయాశ్వికుని నాశ్చర్యముగాఁజూచుచు నిలిచియుండిరి. హాసన్‌ఖాన్ తెల తెల పోవుచుఁ జూచుచున్నకొలఁది రామయ్యపంతులు కల కల లాడఁజొచ్చెను. అదికనిపట్టి యాశ్వికుఁడు ముసి ముసి నవ్వులు నవ్వెను. ఆనవ్వునకు హాసన్‌ఖాన్ కారణముగానక మఱియుఁ జకితుఁడయ్యెను. ఆశ్వికుఁడు బిడ్డను రామయ్యపంతుల కందిచ్చెను. వెంటనే హాసన్‌ఖాన్ గ్రహించి యాశ్వికునకు వంగి సలాముచేసి బిడ్డను ముద్దాడి యెత్తుకొని బిడ్డను దానే నౌకరునకప్పగించి రామయ్యపంతులు తోడురాఁగా నాశ్వికుని నతిగౌరవముగాఁ దనవెంటఁ దోకొనిపోయి యొక ప్రత్యేక మందిరము నేర్పాటుచేసి వలయు నదుపాయములన్నియుఁగడు జాగరూకతతోఁ జేసెను. ఇంతలో రానున్న నాటకమునకు నాందీప్రస్తావనగా పక్షులు గిల కిలారావములఁ బాటలుపాడి కులాయముల కరిగెను. ప్రపంచరంగస్థలమునుండి సూర్యుఁడు సంధ్యారుణ రాగరంజితమైన యవనిక చాటున కేఁగెను.

రామయ్యపంతులును హాసన్‌ఖానును ఉదయముననే దర్శనముచేసికొందు మని యా యాశ్వికునితో మనవిచేసికొని

సెలవుతీసికొనిరి. వర్తకులును హాసన్ ఆజ్ఞచే కందాలో విందార
గింపఁ నేగిరి.

---

## ౧౨

'ప్రాణములర్పణము బిడి నృపాత్మజు నిల్పెను సింహపరిక్షన్'

తెల్లవాఱినచో అంతర్వేది యేకాదశి. రంగరాజు
మహారాజు స్వర్గస్థుఁడై యిప్పటికి ఏఁడాది పూర్తియగును.
ప్రజలనోడి దకములకుఁ గలవెత్తియున్నను, రుస్తుమ్‌ఖాన్ భటు
లచేఁ బన్నుల తన్నులు తినుచున్నను అంతర్వేది తీర్థమున
కీయేఁడు నిరుటికన్న నధికముగా రాఁదొడఁగిరి. గతవత్సరము
కళ్యాణకాలమునకే వచ్చిన జనసమూహము నేఁడు రథోత్సవము
వేళకు రా నెంచెను. రంగరాజుగారా గతించిరి. వంశస్థులా
యెవ్వరును గానవచ్చుటలేదు. రథ మెట్లు కదలునోచూతము
అనినఁ జూత మనుచు బయలుదేఱిరి.

ఉదయమయ్యెను. యథారీతిగా దేవాలయపుఁ దలు
పులు దెఱవఁబడెను. స్నానాలుచేసి యాత్రికులు రాఁదొడంగిరి.
సత్రములు సాగుటలేదు. దుకాణాలు తెఱవఁబడలేదు. బత్తికి
పత్తిరే చాలునని తలఁకొక తులసీదళము గైకొని మెల్లవారు
మెల్లమెల్లఁగా ఆలయములోనికేఁగి స్వామిని దర్శించి యుప
వాసములతో రథయాత్రకై నిరీక్షించుచుండిరి. కన్నులలోఁ
బ్రాణములు పెట్టుకొనియున్న పిల్లమేఁక యందఱు ఎప్పుడు

ప్రొద్దు వాలునా యెప్పుడు రథముసాగునా యని కనిపెట్టుకొని యుండిరి. మఱి యే యితర వినోదమైన నన్నుఁజూచి ప్రొద్దు పుచ్చెడివారు. తుదకు గారడీవాఁడైన గడకట్టి యాడలేదు. ఇఁకఁ గాలక్షేపమెట్లు? ఎట్లో యట్లే కాలము గడపుచుండిరి. బారులుతీఱి కొందఱుఆయిసుక నేలపైఁ గూరుచుండిరి. కొందఱు చెట్ల మూాలమూాలల నాశ్రయించి చతికలఁబడిరి. కొందఱు ఏడ్చెడు పిల్లలను బాబూ ఊరుకో అదిగో చూడు! దేవుఁడు వచ్చుచున్నాఁడు రథముపై ఊరేఁగును. చూడు నాయనా చూడు. అని యోదార్చుచున్నారు. క్రమక్రమముగామూఁడు జాములైనది. దేవాలయమునుండి శ్రుతి హితముగ మంగళ తూర్యారావములు వినవచ్చెను. ఆవాద్యధ్వనుల విని ప్రజలు మెల్లమెల్లగాలేచి రథము చుట్టు మూఁగసాగిరి. గత సంవత్సరములో వారిలోనున్న యుత్సాహ మిసుమంతయు ఈసంవత్సరము మచ్చునకైన మందునకైనఁ గానవచ్చుటలేదు. అయిన దేవతాదర్శనముచేఁ దమ దారిద్ర్యబాధనైన మఱవవచ్చునని వా రారీతిగా స్వచ్ఛటికిఁ చేరిరి. ఉత్సవవిగ్రహములు గుడినుండి బయలుదేఱిన శంఖారావములు వీతెంచెను. ప్రజలలో ఇంచుక యుత్సాహరేఖలు మొలతెంచెను. నృసింహస్వామి వారు వేతెంచి రథారూఢులైరి. ప్రజలు జేజేధ్వనులు చేసిరి. ఈయేఁడు శతవృద్ధుఅయిన యప్పలాచార్యులుగారే దేవునితో వచ్చిరి. నలుగురు పట్టి యావృద్ధుని రథ మెక్కించిరి. ఆచార్యులువారు చేయూఁచిరి. ప్రజలు త్రాళ్లు సారించి లాగిరి.

రథము కదలలేదు. సరే యిఁక లాభములేదని నిస్పృహచెంది తిరుగు మొగము పట్టనెంచిరి. ఇంతలో అప్పలాచార్యులవారు వణఁకుచు వణఁకుచు లేచి పిలిచి కరసంజ్ఞచేఁ బ్రజలఁగూర్చుండుఁడనెను. అందఱు కిక్కురు మిక్కు రనకుండఁ గూర్చుచుండిరి. ఆచార్యులవారు పట్టుపుట్టమున జుట్టఁబడిన యొక మొగలిరేకును బైకిఁదీసి మహాజనులారా! చూఁడుఁడు ఈ మొగలిరేకును. రాత్రి నాల్గవజామున శ్రీ లక్ష్మీనృసింహస్వామివారు స్వప్నమున సాక్షాత్కరించి 'మన రాజవంశ మంతరింపలేదు. నిన్న నేకోలంక నుండి హసన్‌బాదా హసన్‌ఖానుగారివద్దకుఁ జేరినది. ఇదిగో భగవానుడిచ్చిన యీ మొగలిరేకు నందికొని చదువుఁడనఁగానే యొక భక్తుఁడందుకొని,

> "రంగరాజన్య పౌత్త్రుఁడు రామరాజు
> పుత్రుఁ డిప్పుడు మేనత్త పోషిపునంది
> క్రాలుచున్నాఁడు శ్రీహసన్‌ఖాను నొద్ద
> పోయి గొని రండు రథయాత్రపొందఁ జనులు"

అని చదివి యా మొగలిరేకు రథము చెంతనున్న పెద్దల చేతికిచ్చెను. అది యందికొని వారు కన్నుల కద్దుకొని, నిజమే యనిన నిజమేయనుచు సంతసించి తమ యుపవాసశ్రమములను విస్మరించి యేకగ్రీవముగా ఆచార్యులువారూ! ఏమైనాసరే స్వామి వారిని రథముపైనుండి దింపకుఁడు. ఇక్కడనే యహోరాత్రములు అఖండదీపములతోఁ బూజింపుఁడు. ఈ యేఁడు పూర్ణిమ ఆదివారము నాఁడైనది. మహాపర్వము. నాటికి

మూలోఁ గొందఱ మేఁగి హసన్‌ఖానుగారి నాశ్రయించి మహా రాజు కుమారుని ఎట్లో యొకయట్లు వెంటఁగొనివత్తుము. నిజ ముగా ఇది పరీక్షానమయము. ఆచార్యులవారి కల కల్లయో లేక యాతఁడు రాజకుమారుఁడగునో కాఁడో అయినచో వాని చేయివేసిన మాత్రమున రథము కదలునో కదలదో పరికించుట కింతకంటె మంచియదను జిక్కదు కావునఁ బోయివత్తుము. అని గత సంవత్సరము రామయ్యపంతుల నాయకత్వమున నరి గినవారిలో మూగురు ముందునకువచ్చి మేము శరవేగముతో వెళ్ళివత్తుము మీ రుండుఁడు. అని యాపెద్దచేతిలో నున్న మొగలిరేకును హసన్‌ఖానునకుఁ జూపుటకై యందిపుచ్చుకొని మహోత్సాహులై వాయువేగ మనోవేగములతోఁ జనిరి. తీర్థమునకు వచ్చిన జను లందఱు నచ్చటనే యుండిపోయిరి.

త్రయోదశినాఁటి యుదయముననే హసన్‌ఖానును, రామయ్యపంతులును లేచి తమ యతిథిగనున్న యశ్వికుఁడై వచ్చిన రాకుమారునియొద్దకు వచ్చిరి. అతఁడు యున్నతాసన మునఁ గూర్చుండెను. ఇంచుకదూరములో వీరిరువురు వినయా న్వితులై నిలిచిరి. రాజకుమారుఁడు మధుర స్వరముఁతో గూర్చుండుఁ డనెను. ఇద్దఱు ఉపవిష్టులైరి.

హసన్:— తామే స్వయముగా దయచేయవలెనా? మేము మీ యాజ్ఞలఁ బాలింపమా.

రా:— ఎల్లుఁడి త్రయోదశినాఁడు అభిజిల్లగ్నమున మన యాత్రకు అనుకూల మని విని వచ్చితిని. నారాక మీకుఁ బ్రతిబంధకము కాదనుకొందును.

హాసన్:—తమరాక ప్రతిబంధకముగూడనా? ప్రతిబంధక కవాటములు తమయాగమనమునఁజేసిభద్దలునబ్రద్దలుకాఁగలవు. సమయానకు రామయ్య పంతులుగారుకూడ నిచ్చటనే యున్నారు. మఱి తడవుకొనవలసిన దేమియు లేదు. సర్వము సంసిద్ధము. మీసెలవు ప్రకారము నేఁడు త్రయోదశి శుక్రవారము. బయలు దేఱవచ్చును. అభిజిల్లగ్న వేళకు మా నమాజుకూడ నగును. ఉభయతారకమైన శుక్రవారము. శుభోదర్కము కాఁగలదు.

రా:— ఔను రాజన్యశిరోమణీ! అట్లే కావింపవచ్చును.

ఆ:— మఱి పొందవలసిన —

రా:— పొందవలసిన దేమియు లేదు. మీచీటికి ఫలితముగా మన వ్యాపారమునకుఁ దగినంతమంది వర్తకులు నిన్ననే వచ్చిరి. అని చిఱునవ్వు నవ్వెను.

అంతలో నొక సేవకుఁడు వచ్చి హాసన్‌ఖానునకు సలాముచేసి యంతర్వేదినుండి ముగ్గురు యాత్రికులు దర్శనార్థమై వచ్చి యున్నారనెను. ఈ ముగ్గురుగూడ నొకరి నొకరు నాశ్చర్యముతోఁ జూచికొనిరి. హాసన్‌ఖాన్ వెంటనే ప్రవేశ పెట్టు మనెను. క్షణములో యాత్రికులు వచ్చి నమస్కరించి నిలిచిరి. ఆ మొగము లెచ్చటనో చూచిన ట్లుండుటచే హాసన్ ఎప్పుడైన మీ రిచ్చటకీవఱకు వచ్చినారా? యని ప్రశ్నించెను. యాత్రికులు రామయ్యపంతులుగారి వంకఁ బరిచయ దృక్కులు ప్రసరింపఁజేసి 'ఆఁ చిత్రము నిరు డీరోజులలో ఇరుగో ఈ పంతులుగారితో ......

హసన్:— సరి సరి. తెలిసినది. ఇపు డేల వచ్చిరి?

యా:—తమ దర్శనమునకు. జీవచ్ఛవములమై యున్న మమ్మఁ దిలకింపుఁడు —

హసన్:— ఆపరిపాలనమును మార్చుటకే మేమును దలపెట్టి యున్నాము. - మతేవి శేషములు లేవుగదా?

యా:— మా గోడుఅంత తమకుఁ దెలిసినదే మఱి చర్విత చర్వణమేల? కాని ప్రభూ! ఒకమహావిశేషము. కని విని యెఱుంగము, చిత్తగింపుఁడు. రథోత్సవమును జూచుటకై మామూలుగా అందఱము పూఁనినాము. రథము త్రాడు పట్టినాము. కదలలేదు. పెద్దాచార్యులు గారు రథముపై నిలిచి ఇదిగో ఈపద్యముగల మొగలిరేకును స్వామివారుకల లోనిచ్చినారని పఠించి మాకువినిపించినారు. దానిని విశదము నిమిత్తమై మీయొద్దకుఁ దెచ్చినారము. చిత్తగించి, మావచ్చిన కార్యము సఫలముచేసి మమ్ముద్ధరింపుఁడు.

అని హసన్ఖానున కొసంగిరి. అదిచూచి చదువుకొని ఆనందబాష్పములువిడి రామయ్యపంతుల కందిచ్చెను. అది చదువుచునే యాయన సంతోషముపట్టలేకయో, విచారము పట్టలేకయో, ఆశ్చర్యముపట్టలేకయో కాని యొక్కసారి కంపించెను. రేకు చివరిభాగముపట్టుకొని వణఁకుచు ఆరాజకుమారున కందిచ్చెను. అది చదివి రాజకుమారుఁ డాశ్చర్యచకితములైన చూపులతో నొకనిట్టూర్పువుచ్చి దైవమింత యనుకూలించునే యని లోలోనానందించెను. ఒకళ్ళొకళ్ళ మొగముల

సాభిప్రాయముగాఁ జూచికొనిరి. వెంటనే హసన్‌ఖాను ఆవచ్చిన తైర్థికులను గాంచి మీరు భోజనముచేసి ముందు నడువుఁడు. మేము పూర్ణిమనాఁటికి అక్కడకుఁ జేరుకొందుము. ఈవిషయ మెక్కడను బొక్కనీయకుఁడు. అనఁగానే వారు చిత్తమని చిత్తములు ఆనందాయత్తములుకాఁగా భోజనముచేసి పరుగు పరుగున వెడలిపోయిరి. వర్తకులకు ముందు సాఁగిపో నాజ్ఞ యిచ్చిరి. వారును భోజనములకు లేచిరి.

సరిగా పన్నెండు గంట లాయెను. మూఁడుత్తమాశ్వములు సజ్జీకృతములై వచ్చి కుడికాళ్ళతో నేలఁద్రవ్వుచు నోడ లాకుంచితములుగా సకిలించుచు నిలువఁబడెను. ముగ్గురు యోధు లాయుధధారులై యాయశ్వముల నారోహించిరి. ఒకయోధుని యొడిలోఁగోటిసూర్యప్రకాశమానుఁడగుబాలుఁ డాసీనుండై యుండెను. అనుకూలవాయువులు మందమందముగా వీచెను. దిక్కులు ప్రసన్నములాయెను. పాలపిట్ట లెదు రాయెను.

ఆనాఁడు మాఘమాసపు ఆదివారమగుటచే వాసిష్ఠీ సాగరసంగమమున స్నానము చేయుటకై యేకాదశినాఁడు రాని ప్రజలుకూడఁ దండోపతండములుగా నంతర్వేదికి వచ్చి పడిరి. ఏకాదశినాఁడు వచ్చిన తైర్థికులు నాఁడుమొదలు నేఁటి వఱకు నచ్చటనేయొకపూఁటతిని తినక యుండిపోయిరి.

సరిగాఁ బగలు రెండుజాములైనది. సూర్యుఁడు దేవాలయ శిఖరముపై నిలిచెను. అర్చకులు సాయంకాలము గరుడ వాహనోత్సవము పెందలకడ సాఁగింతమను తొందరలో నుండి

రథోత్సవముకూడఁ బెంగలకడ సాఁగింప సర్వమునంసిద్ధము చేసిరి.

ప్రజలందఱు మాటిమాటికి నలుదిక్కులు పరికించుచుం డిరి. ఏదిక్కున నలికిడి తగిలిన ఆదిక్కు మొగంబై విఱుగఁబడు చుండిరి. ఇంతలో కొంతదూరమున దుమారము కానవచ్చెను. అంతలో టక టకటక యను చప్పుడు వినవచ్చెను. వెంటనే మూఁడు ఆజానేయములు [ఉత్తమాశ్వములు] నుచ్చిళ్లు గ్రక్కు కొనుచు వచ్చి నిలిచెను. ప్రజలు జే జే నినాదములు చేయుచు నొకరిపై నొకరు పడుచుగల్లంతుగా మూఁగఁజొచ్చిరి. ఆయాశ్వి కులలో నొకఁడు తనధరించిన యుసుపులను మార్చిప్రకృతివేష ములోఁ గుఱ్ఱముమీఁద నిలిచి చేయిచాఁసి దారి యుండవిసైఁగ చేసెను. పోయిన 'సాలున' రథోత్సవమునాఁడు హసన్ బాదాకు నాయకుఁడై తమ్ముతీసికొని వెళ్ళిన యాతఁడతఁడేయని చాల మంది గుర్తించి వానియాజ్ఞల నానందముతో మన్నించిరి. మొన్న హసన్ బాదాకు వెళ్ళి వచ్చిన మూఁగురు పూరుషులు గూఁడ నాజనసమూహము నందేగలరు. మూఁడవయోధుని యొడిలో నున్న పిల్లవాఁడే రాజకుమారుఁ డని యందఱుఁదెలిసి పోయెను.

ఆముగ్ధమోహనమూర్తినిఁగాంచి యందఱు సమ్మోహి తులైరి. 'ఆకన్నులు, ఆముక్కు, ఆనిరిజాలు, ఆబుగ్గలు, ఆచేతులు అన్ని అచ్చముగా రంగరాజు రామరాజుగారల నుండి పుణికి పుచ్చుకొన్నట్లున్నవి. నిశ్చయముగా ఈతఁడే రాకుమారుఁడై

యుండును అనియనుకొనుచుండిరి. ఆమూర్తినిఁగాంచిన యాఁడు వారందఱు అయ్యో పాపము ఇటువంటి చక్కని బిడ్డను జూచి యానందించెడు భాగ్యము ఆతల్లి జానకీదేవిగారికిఁగాని తండ్రి గారికిఁగాని తాతగారికిఁగాని లేకపోయెనే యని వగవ సాగిరి. అంతలో అర్చకుండు ఏమీ యెఱుఁగనట్లు రథము సాగింపుఁ డనెను. ప్రజలలో గుజగుజలు బయలుదేఱినవి. మనము రథముసాగించుటగాదు. నిజముగా ఇతఁడు రాజకుమారుఁడైన చో రథముపై చేయివేయఁగానే యది తనంత తానేసాఁగిపోవల యును. కాకున్న నితఁడు మొగలితుర్తి రాకొమరుఁడుగాఁడు. లోకములో అనేకులు రాజ్యములు నిలుపుటకై కులగోత్రములు లేని యెవరినో దీసికొనివచ్చి రాజవంశస్థుఁడని నిలుపుచున్నారు. కాన మన మీవిషయమున మొగమోట పడరాదని పట్టుపట్టిరి. అందఱు వల్లెయనిన వల్లెయనిరి. ప్రజలందఱు ఎడముగా బారులు తీఱియనిమేషులై చూచుచుండిరి. గుఱ్ఱములపైనున్న వారుదిగిరి. అర్చకుఁడు గంటలు వాయించి దీపముత్రిప్పి గోవిందాయనియాఱ చెను. ఆయాశ్వికుఁడు ఆ చిన్న వానిని బుజ్జగించి బాబూ! చూడు ఈ త్రాడు పట్టుకొను మనెను. వెంటనే యా బాలుఁడు సర సర సింగపుఁబిల్లవలె నడచి వెళ్ళి యారథము త్రాటినిఁబట్టి ఊఁయని లాగెను. లాగియు లాగుటతోడనే శతాంగము చిఱుగం టలు గల్లు గల్లురనఁ గదల నారంభించెను. దగ్గఱనున్న యాశ్వి కులు మహానందముతోఁ దటాలునఁ బిల్లవానిని పైకిఁదీసి గుఱ్ఱ ములపై వ్రాలిరి. వారు తప్పుకొనుటయే తడవుగా రథము

శరవేగముతోఁ బఱవఁజొచ్చెను. ప్రజలు ఆనందపరవశులై జయ మహారాజకుమారునకు జయ యని యొడలెఱుంగ కుండ నఱవఁ జొచ్చిరి. ఆరథ మారీతిగా గుఱ్ఱాలకట్టగుడిదాఁకఁ బఱచి యచ్చట నాఁగెను. ప్రజలు అచ్చట మూఁగి రాజకుమారుని అందఱకు నగుపడునట్లు గుఱ్ఱముపై నిలువఁబెట్టుఁడని యఱచిరి. వెంటనే యాశ్వికు లట్లు గావించిరి. ప్రజలు కర్పూరహారతులతో నృపతనయుని దీవించిరి. అప్పటికే పార్థివ సూనునితో నున్న వారిలో నొకఁడు హసన్ఖాననియు రెండవ వాఁడు రామయ్యపంతు లనియు అందఱకుఁ దెల్లమయ్యెను. మూఁడవ మూర్తినిగూర్చి వారు ఎవరో దళవాయి యయి యుండునని తలంచి ప్రశ్నింపరైరి. రథము తిరిగినది. గుడి యొద్దనాఁగినది. దేవుని దేవాలయమునఁ బ్రవేశపెట్టిరి. ప్రజల కానందము ఆవేశము ఆఁగలేదు. ఆశ్వికులఁచుట్టు మూఁగి యడ్డమువచ్చి హసన్ఖానుగారూ! ఏమైనను సరే యిక్కడ నుండియే మీరు ఈ రాజకుమారునిఁ దీసికొనిపోయి మొగలి తుర్తికోటలో సింహాసనాధిష్ఠితునిఁజేసి మీరు ప్రతినిధియై పరిపాలనంబు సాఁగించి మా దారిద్రముఁబాపి మమ్ముఁగట్టెక్కింపవలయును. లేదా మేము మిమ్మిక్కడనుండి యొక్కయడుగైన ముందునకు సాగనీయము. మీగుఱ్ఱముల కడ్డుగాఁ బరుందుము. మాపైనుండి మీయశ్వములఁ ద్రోలుఁడు. లేదా యింకను జాముప్రొద్దు లోపుగా నున్నది సాయంకాలమునకు

మీతో వెన్నంటివత్తుము. అని పట్టు పట్టిరి. ప్రియాభిప్రాయ మును పాటించుట యతని పరిపాటియగుటచే మీరందఱు రావలదు. ఆఁగుఁడు. మేమే మీ కోరినచొప్పున వెడలివత్తుము. యుద్ధము చేయవలసినంత యవసరమేర్పడినచో మీకుప్పందింతుము వచ్చి వ్రాలుఁడు. మాచేయిమీఱినప్పుడుగదా మీసాయము సర్థింపవలయును. ఫలము నేఁడే తేల్తుము. విజయమునకై భగవంతునిఁ బ్రార్థింపుఁడు. అని వారు మువ్వురు వసిష్ఠానదినిదాఁటి సాయంకాలము కాకమునుపే మొగలితుఱ్ఱు కోటయొద్దకుఁజనిరి. ఆపుట్ట చాటున, ఆచెట్టుచాటున నున్న వర్తకవేషధారు లందఱు నొక్కమాఱు సాయుధపాణులై యక్కుముక్కలంబోని మహాయోధులై నిప్పులు గ్రక్కుచు వీరినిఁజేరి నిలిచిరి. వెంటనే హసన్ ఖాన్—రాజకుమారునకుఁ దగిన రక్షణ యిచ్చి కోట కించుకదూరమున రామయ్యాపంతు తులు ససైన్యముగ మధ్య నిలిపి తాను దేవిడీయొద్దకు వెళ్ళి కావలివానినిఁ బిలిచి 'యువరాజుకుమారులు హసన్ ఖానుగారు దర్శనార్థులై వచ్చియున్నారని చెప్పుమని' రుస్తుమ్ ఖానునకు వర్త మాన మంపెను. ద్వారపాలకుఁడు పరుగు పరుగునఁ బోయి యావార్త సభామందిరమునఁ గూర్చుండి హుక్కాపీల్చుకొను చున్న రుస్తుమ్ఖానున కెఱుఁగఁ జేసెను.

అది విని రుస్తుమ్ఖాన్ ఉలికిపడి కుర్చీలోనుండి క్రింది కుఱికి ఇతి కర్తవ్యతా మూఢుఁడై యిటు నటు వెఱ్ఱివానివలెఁ దిరిగి దిరిగి సరే. రమ్మను. ఉఁ ఉండు. ఊఁ సరే రమ్మను

అని చెప్పెను. వెంటనే దౌవారికుండు వచ్చి దయచేయుఁడు' సెలవైనది యనెను. హసన్‌ఖాన్ చేయివిచెను. క్షణ ములో మెఱవుమెఱసిన చందాన నాలుగువందలమంది యస హాయ శూరులు వాని పిఱుందన లోనికిఁ జనిరి. వారిలో ఒక్కొక్కఁ డొక్కొక్క వేయిమందిని జంపువాఁడుగాఁ గని పించుచుండుటచే నెవ్వరును వారిని వారించుటలేదు. అంద ఱకు ఆశ్చర్యముగా నున్నది. హసన్‌ఖాన్ తిన్నఁగా సుధాకర మందిరమునకేఁగి తండ్రికి వంగి నమస్కారముచేసి ప్రక్కనున్న యాసనముపైఁ గూర్చుండి పలికెను.

'నాయనగారూ! మీరు క్రూరకర్ములై మొగలితుర్తి కోటను రాజ్యమును ఆక్రమించుకొన్నారు. ఇస్లాము మత విరుద్ధముగాఁ బరిపాలనము సాగించుచున్నారు. మీ యేఁడాది పరిపాలనములోను బ్రజలు ఒకపూఁట గంజికిఁ గూడ గతిలేక మల మల మాఁడిపోవుచున్నారు. కట కటా యిట్టి కట్టడి కార్యముల్లచే మీరీ రాజ్యపాలనము, నెంతకాలము సాఁగింతురు. నేను ఇది మీ క్షధర్మ మని రామయ్యపంతులుగారిచే రాయ బారమంపఁగా మీరు వారిని గడ్డిపోఁచకుఁ గొఱగానివారి నిఁగాఁ జూచి యగౌరవ పఱచినారు. అన్యాయార్జిత విత్త మున విఱ్ఱవీఁగుట యెంత వెఱ్ఱితనము. మీకును గాలము గడచినది. ఈ రాజ్య మెవరికొఱకు. ఈ సంపద యెవరికొఱకు. నాకొఱకా మీరింతకుఁ బదిరెట్లు రాజ్యము నార్జించి నాకుఁగట్టఁ బెట్టినను నేను దానిని స్వీకరింపను. ఒకని కాజ్ఞాపించుటకంటె

నొకనియాజ్ఞకులోఁబడుటయే యుత్తమకార్యము. జ్ఞానియైనవాఁ
డెవ్వఁడును ఈబందిపోటు రాజ్యసంపదను కాంక్షింపఁడు. మీరే
గురువు, తల్లి, తండ్రి, పురుషుఁడు, విద్య, దైవము, దాత
యను నేడుగడగా నమ్మి రాజ్యమును కోటను, శుద్ధాంతములను
మీరక్షణలోఁ బెట్టి పండినపండు ధర్మప్రభువు తాను పుత్రాన్వే
షణమునకై యడవులకేఁగ నింతచేయుట మీకు ధర్మము
గాదు. రాజవంశము లేకుండఁ జేయనెంచిన మీయత్నమేమైన
ఫలించినదికనుకనా? మీరు చిరకాల మేలనెంచిన యీ
రాజ్యాధిపత్యము నిలుచుటకు? ఇప్పటికైన నామాట పాలించి
యీరాజ్యమును మహారాజు మనుమనికొసంగి పశ్చాత్తాపమును
వెలిపుచ్చి పాపమును దొలఁగి పుణ్యమునఁబొందుడు. చల్లకువచ్చి
ముంతదాఁచనేల? బాలరాజు నాసంరక్షణముననే నాపర్యవేక్ష
ణముననే పెరుగుచున్నాఁడు. నా ప్రాణములైన నర్పించి యీ
బాలుని ఈసుధాకరమందిరమున సింహాసన మెక్కింతునుగాని
మానను. ఇదిగో ఇటుతిరిగిచూడుఁడు. ఈవచ్చిన యోధులవంటి
మహాయోధులు అప్పుడె యీకోటచుట్టు ముట్టడించియున్నారు
మీరు ఉదారహృదయముతో గతమును విస్మరించి ఈ
తాత్కాలిక రాజ్యమును విడిచి పుచ్చుఁడు. లేదా యుద్ధము
నకు సిద్ధముకండు. మఱి మాఱు మాట పలుకకుఁడు 'యుక్తోవా
మృత్యుర్వా' యేదోయొక్కటి యిప్పుడే తేలిపోవలెను. మఱి
నాన్చుటకు వీలులేదు. ఏమి మాటలాడరేమి? చెప్పుడు యుద్ధ
మునకు సిద్ధమందురా? రండు లెండు. కాని యొక్కమాట,

నిష్కారణముగా మనకై ఈయోధవారమునంతను మడియించు టకంటె మనమిరువురమే బరిపైఁబడి పోరుదము. విజయలక్ష్మి మిమ్ము వరించిన మీరే యేలుకొనుఁడు. నేను గెలిచిన రాజ కుమారునిఁ పట్టాభిరాముని సమక్షమున అంతర్వేది నృసిం హునిసాక్షిగాఁ పట్టాభిషిక్తుని గావింతును. ఇంతకుమించిన ప్రసంగము అనంగతము. ఏదియో తేల్పుఁడు. ఒక్క క్షణమైన ఆలస్యము కారాదు. అన నతఁడుక్కిరిబిక్కిరియై క్షణకాల మూరకొని దండతాడితభుజంగము భంగి నిట్టూర్పుచు వరే సిద్ధపడుము. యుద్ధమునకు. నేనిదే కాసెబిగించుకొని వత్తునని లేవఁబోవుచుండఁగా 'నాన్నగారూ! నేను రెండునాళ్ళనుండి భోజనము సరిగాచేయక యాఁకలిగొనియున్నాను. ముందు నాకన్నము పెట్టించుఁడు పిమ్మట యుద్ధమున కుపక్రమింతమన నాతఁడు తలయూఁపి లోనికేఁగి గడియలో వచ్చి రా! హసన్! రా! భోజనము చేయుదమనెను. ఇద్దఱు వెళ్ళి మూఁడుముద్దలు గా భుజించివచ్చి కత్తులుచేతఁబుచ్చుకొని వచ్చి సుధాకరమంది రమునకును దివ్వాన్‌ఖానాకును మధ్యగనున్న సమప్రదేశమున నిలిచిరి. ఇరువురును కరవాలములను ఒఱలనుండి పైకిఁదూసి కొఱవులు త్రిప్పినట్లుగాఁ ద్రిప్పుచు నేలకు వంగియుఁ బ్రక్కకుఁ దిరిగియు కోత్తలచేసియు యుఱికియు కూర్చుండియు లేచియు, ప్రక్కవాటుగాఁ బరువిడియు ఒక్కమారుగా దూకియు మడమ త్రిప్పకుండఁ బోరిపోరి శూరత్వములు ప్రకటించుకొనుచుండిరి. అంతలో రుస్తుంఖాను వెనుకకుఁదగ్గినట్లు తగ్గి యొకేవడుగున

వచ్చి హాసన్‌ఖానుఁ బొడువ బోవఁగా హాసన్ ఆపోటు దప్పించు
కొని డేగవాటున రుస్తుం ఎదురుఱొమ్ములోఁ దనతలవారితో
హుమ్మని హుంకరించుచు బొడిచెను. ఆపోటు ఆయువుపట్టున
నాటి రుస్తుంఖాను వీరశయనమును గాంచెను. వెంటనే చెంత
నున్న హాసన్‌ఖాన్ యోధులు సింహనాదము చేసిరి. ఆధ్వని
విని రామయ్యాపంతులు వానితోనున్న రాజకుమారుఁడును
బాలరాజుతో వచ్చి యచ్చటవ్రాలిరి. రణరంగమునఁబడి యసు
వులు తొఱఁగియున్న రుస్తుంఖానునుగాంచి నిశ్చేష్టులైరి. గుఱ్ఱ
ములపైనుండి బిరాలునంగ్రిందికిఁ దిగిరి. రామయ్యాపంతులు
హాసన్‌ఖానును ఆలింగనము చేసికొనెను. హాసన్‌ఖాన్ కన్నీళ్ళు
కార్చి మహారాజకుమారుని ఎత్తికొని ముద్దాడి సుధాకరమంది
రమునకు బిరబిరఁ జనెను. రుస్తుంఖాను బలఁగము తోఁకముడిచి
పరువిడెను. హాసన్‌ఖాన్‌తో వచ్చిన యోధాగ్రేసరులు ఇద్ధతే
జులై చంద్రధ్వజమును దింపి పట్టాభిరాముని యాలయగోపుర
ముపై సూర్యధ్వజ మెత్తిరి.

హాసన్‌ఖాన్ మహారాజకుమారుని సుధాకరమందిర
మునఁ బూర్ణిమ సుధాకరునివెలుఁగున సింహాసనాధిష్ఠితునిఁ జేసి
కిరీటము పెట్టెను. రాజకుమారుఁడు క్షణములోఁ బట్టాభి
రాముని ఆలయమున కేఁగి దీపారాధనచేసి జయఘంటిక గొట్టి
సుధాకర మందిరమునకు వచ్చెను. ఇప్పు డతఁడు రాజకుమా
రుఁడుకాఁడు అమ్మాజీ. యోధులందఱు ఆశ్చర్యపడి వంగి
నమస్కరించిరి. అమ్మాజీ! రాజకుమారునకుఁ బట్టాభిరాముని
పాదపీఠికపై నర్చించిన కుంకుమ బొట్టుపెట్టి చంకఁబెట్టుకొనెను.

హసన్‌ఖాన్ తలతిరుగుచున్నదని సింహద్వారము చెంత నున్న అరుగుపై వ్రాలెను ... అమ్మాజీ కంగారుపడెను ... రామయ్యపంతులు గంతులువైచెను. హసన్ ఒకడోఁకు డోఁకెను ఆడోఁకుతో హంస యెగిరిపోయెను. ఆనందమయ ప్రపంచము పై మరల విషాద వస్త్రముగప్పఁబడెను. అంతలో నొక కుక్క చరాలున వచ్చి యాకక్కు తిని గుక్క తిరగకుండ గిరగిర తిరిగి చచ్చెను. అందఱు రుస్తుంఖాను చేసిన దుర్మార్గమునకు నిర్విణ్ణులైరి.

అమ్మాజీ కృతజ్ఞతాసూచకముగాఁ గోటలోనే హసన్ ఖానునకు సమాధిగట్టించెను.

నేఁటికిని దద్వంశీయులు ఆసమాధిని ఏఁటేఁట మాఘ శుద్ధ పూర్ణిమనాఁడు పూలతోఁ బూజించుచుందురు.

—౫—

రాయల ముద్రాణాలయము, తణుకు—జూన్, 1952.